# ఇదేమిటి?

(నాటకం)

రచయిత

భమిడిపాటి రాధాకృష్ణ

పబ్లిషర్సు:

కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

## గ మ ని క

ఈ నాటకాన్ని ఎందుకోసమేనా సరే ప్రదర్శింపదలచిన వారు, ముందుగానే అందుకు రచయిత లిఖితానుమతి పొందడం చిన్న మర్యాద, అన్నట్టు అటువంటి లిఖితానుమతి పొందకుండా ప్రదర్శించడం కాపీరైటు చట్టప్రకారం నేరం కూడాను!

భమిడిపాటి రాధాక్రిష్ణ.
రాజమండ్రి.

## కృ త జ్ఞ త

ఆంధ్రకేసరి నాటక కళాపరిషత్తు, విశాఖపట్నం - మార్చి 1958. రాఘవ నాటకోత్సవాలు, విజయనగరం - ఏప్రియల్, 1958. ఇంటర్ యూనివర్శిటీ ఆంధ్రనాటకోత్సవాలు, విశాఖపట్నం- డిశంబరు, 1959 ఆంధ్రనాటక కళాపరిషత్తు మహాసభలు, హైదరా బాదు-ఫిబ్రవరి 1959.

మొదలైన అఖిలాంధ్రనాటకోత్సవాలలో ఉత్తమస్థాయిలో అతి ప్రశంశనీయంగా ప్రదర్శన లిచ్చిన,

యువజన కళాసమితి, వాల్తేరు.
గవర్నమెంటు ఆర్ట్సుకాలేజీ ఫైన్ ఆర్ట్సు ఎసోసియేషన్, రాజమండ్రి.
శ్రీ నవ్యకళా మండలి, విజయవాడ.

వారికి

నా హృదయ పూర్వకమైన

అభివందనాలు.

# ఇదేమిటి?

## పాత్రల పరిచయం

| | | |
|---|---|---|
| ధనరాజు | : | బియ్యం వ్యాపారి. డబ్బుకి గడ్డితినే అదృష్టవంతుడు. |
| శాంత | : | ధనరాజు కూతురు. |
| ప్రసాదం | : | ధనరాజు బావమరది. అమాయకుడు. |
| రామారావు | : | శాంతని ప్రేమించిన యువకుడు. |
| నారాయణరావు | : | జమిందారు బిడ్డ. రామారావు స్నేహితుడు. |
| ప్రెసిడెంటు | : | ధనరాజు ఉన్నఊరికి ప్రెసిడెంటు. ఆరగించడంలో స్వపరభేదాలు లేనివాడు. |
| చెవలయ్య | : | ధనరాజుకి నౌఖరు. |
| చింతయ్య | : | ఆ ఊళ్ళోనే ఉన్న భోగారావు అనే మరో జమిందారుకి నౌఖరు. |

[ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘం అధ్వర్యాన హైదరాబాదులో జరిగిన ఆంధ్రనాటక కళాపరిషత్తు మహాసభలలో 6–2–1958 వ తేదీని శ్రీ నవ్యకళామండలి, విజయవాడ, వారిచే ప్రదర్శింప బడినది.]

| పాత్రలు | | పాత్రధారులు |
|---|---|---|
| ధనరాజు | : | శ్రీ D. జగన్నాధరావు. |
| ప్రసాదం | : | P. వెంకటేశ్వరరావు. |
| చవలయ్య | : | G. రాధాకృష్ణమూర్తి. |
| రామారావు | : | ch. శ్రీరాములు. |
| నారాయణరావు | : | S.V. సీతారామయ్య. |
| ప్రెసిడెంటు | : | M.V. చలపతిరావు. |
| చింతయ్య | : | K. L. N. మూర్తి. |
| శాంత | : | కుమారి V. లక్ష్మి. |

ఈ పరిషత్తులో ప్రసాదం పాత్రధారి శ్రీ P. వెంకటేశ్వరరావు ఉత్తమహాస్యనటుడుగా ఎన్నుకోబడ్డారు.

# ఇదేమిటి?

## 1-రంగం

[ తెరతప్పుకోగానే ఒక పల్లెటూరి ఇంట్లో ఫెళ్ళహాలుగది కనిపిస్తుంది. ఆహాలుకి మూడు ద్వారాలుంటాయి. ఇంట్లోకి Right Front (R.F.) లో ఒకటి, వీధులోకి Left Front (L.F.) లో ఒకటి. ఇంట్లోకి దారి తీసే మరొకద్వారం Middle Back (M.B.) లో మరొకటి ఆమధ్య గుమ్మం ముందునుంచి కుడిపక్కగా మేడపైకి మెట్లు ఉంటాయి హాలులో ఒకకఱ్ఱ పడకకుర్చీ, రెండు సాదాకుర్చీలు ముఖ్యం. పరిసరాలూ, పరికరాలూ, ఫక్తు పల్లెటూరి వాతావరణాన్ని ప్రస్ఫుటం చేస్తుండాలి.

తెరతప్పుగున్న నాలుగైదు క్షణాలతర్వాత "ధనరాజుగారూ !- ధనరాజుగారూ !-" అన్నపిలుపు L.F. లోంచి స్ఫుటంగా వినిపిస్తుంది. ఒక నిమిషంఅయ్యాక మళ్ళీ అదేపిలుపు. వెంటనే R.F. లోంచి "వత్తున్నా"!- అని కేకవినిపిస్తుంది. R.F. లోంచి చెవలయ్య వచ్చి. L.F. లోకి వెళ్ళి, నారాయణరావు, రామారావులతో తిరిగి వస్తాడు.]

చెవ : (కొత్త మొహాల్ని చూసినట్టు చూస్తూ) ఏవ్వూరు బాబూ, మంది ?-

నారా : గోపారం !-

రామా: (నారాయణరావుని చూపిస్తూ) గోపారం చిన జమీందారుగారు !

చెవ : (వినయంగా) అట్టాగా !- దయచేయండి, బాబూ!- దయచేయండి. (ఇద్దరూ చెవలయ్యచూపెట్టినకుర్చీల మీద కూచుంటారు.)

నారా : ఊ! ధనరాజుగారు ఉన్నారోయి ?

దేవ : థ్యాంక్సండి. సిగరెట్లో కేకేసుకొస్తాను, తమరు కూర్చోండి!

[అని తొందరగా R F. లోకి చక్కాపోతాడు. నారాయణరావు తన సిగరెట్ టిన్నులోంచి, సిగరెట్ తీసుకుని, వెలిగించుకుంటాడు. రామారావు అతని వెనుక పచార్లు ప్రారంభించేసరికి, M.B లోంచి శాంత ఉత్సాహంగా కూనిరాగం తీసుకుంటూ ప్రవేశించి, రామారావుని హఠాత్తుగా చూసి ఆగి తెల్లబోయి, సిగ్గుపడి, తెప్పరిల్లి, మేడమెట్లవైపు తొందరగా తిరుగుతుంది. రామారావు ఆనందంతో, "శాంతా!- అంటూ రెండడుగులు ముందుకు వేస్తాడు. శాంత మేడపైకి మెరుపులా మాయమవుతుంది, రామారావు వెనక్కాలే బయల్దేరబోతాడు. నారాయణరావు ఆతన్ని కేకేసి, ఆపి, మళ్ళీ కుర్చీదగ్గరకి తీసుకొస్తాడు.]

నారా : (చిరునవ్వుతో) ఆవిడేనేమిటోయి, నీ ప్రేమదేవత! (రామారావుకూడా చిరునవ్వుతో అవునన్నట్లు తల ఊపుతాడు.) అయితేమాత్రం? అల్లా మెట్లెక్కిపోతున్నా వెక్కడికి? – వాళ్ళనాన్న చూస్తే వీపు చిట్లగొడతాడు, తెలుసా?

రామా: ఏమైనా సరేగాని, నారాయణరావు! నేను శాంతని పెళ్ళిచేసుకుతీరాలి. ఆమెను మనసారా ప్రేమించాను!

నారా : దానికేం? – ప్రేమించడానికి పెట్టుబడేంకావాలి?– ఫలించడమే కష్టం.

రామా: అందుకనేగా, నిన్ను నమ్ముకున్నాను!

నారా : అందుకనేగా, ఇక్కడికొచ్చాం!

రామా: ధనరాజు పిల్లికి బిచ్చంపెట్టడట ఎల్లా పడగొడ తావో, ఏమిటో!

నారా: పిల్లిగొడవ నీకెందుకయ్యా? ఆపిల్లను నువ్వు పెళ్ళి చేసుకునేలా చేస్తాను, సరేనా?

రామా: ఆసాయం చేస్తివా, నీకు జన్మంతా ఋణపడిఉంటాను.

నారా: అది సరేగాని, చెప్పిన ప్లానంతా జ్ఞాపకంపెట్టుకుని గుళ్ళోజేముడల్లా కూర్చో!- అదిగో ఆయన వస్తు న్నాడు!

[ధనరాజు R F. లోంచి చిరునవ్వుతో వస్తాడు. నారాయణరావు రామారావులు, ధనరాజుకి నమస్కరిస్తారు,]

ధన: (ప్రతినమస్కారంచేస్తూ) నమస్కారమండి!-దయ చేయండి! (అంతాకూచుంటారు.) తమరు గోపా రం జమిందారుగారి పుత్రులా?

నారా: మరేనండి; నాపేరు నారాయణరావు.

ధన: చిత్తం!

నారా: మిమ్మల్ని ఎప్పుడూకలుసుగోలేదుగాని, నాన్నగారు చెబుతూంటే, విన్నాను మీగురించి!

ధన: (ఆశ్చర్యంగా) అల్లానా!-

నారా: ఆ!-ధనరాజుగారు పెద్ద వ్యాపారస్తులనీ, చాలా మంచివారనీ నాన్నగారూ చెబుతూంటారు.

ధన: (మురిసిపోయి) ఏమిటో!- వారి అంతఃకరణ అటు వంటిది. కొంచెం మంచితీర్థం పుచ్చుగుంటారూ?

నారా : వొద్దులెండి! ప్రస్తుతం ఒక అత్యవసరమైన పని మీద వచ్చామండి.

ధన : అల్లానా?—చెప్పండి, ఏమిటో!

నారా : మా ఊళ్ళో అనుకోకుండా పెద్ద సంతర్పణ చేయించ వలసివచ్చింది నాన్నగారు, పాతదంపుడు బియ్యం తప్ప వార్పించడానికి వీల్లేదన్నారు.

ధన : జమిందారులుకదుమరీ?

నారా : ఏంజమిందారీలో ఏమిటో!— స్వంతఖర్చుతో కాగితాలమీద అచ్చేసుకుందుకూ, అనవసరంఖర్చు తగుల్చుకుందుకూ పనికొస్తాయి, అంతే!— సరుకులు కొండానికి పొద్దున్నే ఈవూరు వచ్చానండీ?— ఇంట్లోఉన్నబస్తాలుచాలవు, ఇక్కణ్ణుంచి ఇంకా పట్టుకురమ్మని నాన్నగారు కబురుపెట్టారు.

ధన : సంతర్పణకి బస్తాబియ్యం చాలదుటండీ?

నారా : ఉత్తసంతర్పణయితే బస్తాకూడా ఎందుకండీ?— నోములు కదండీ!

ధన : అవోటూ?—

నారా : మరే!— సంతర్పణకి ముందు ఏభై బస్తాలదాకా దానాలివ్వాలిట—ఏమిటో చాదస్తం!

ధన : అయితేంలెండి, మీలాటివారు చేయించకపోతే ఇంకెవరుచేస్తారు? — ఇప్పుడు తమకి ఎన్నిబస్తాలు కావాలి?

నారా : ఊఁ? — అయినబస్తాలు చాలంపి!

ధన : ఇంతేనా?—అయితే బజార్లో మాకొట్టువద్దర తీసుకో పోయారా?

నారా : తీసుకోపోయానూ!—కాని అక్కడ సరుకొట్టే నచ్చలేదండి.

ధన : పోన్లెండి!— మనింటివద్దర ఇంకామంచి సరుకుందండి. ఒరేయి, చెవలయ్యా!—

చెవ : (R. F. లోంచి వస్తూ) బాబయ్య!—

ధన : లోపలికెళ్ళి అమ్మాయిగార్నడిగి, ఒకటోరకం కిచిలీ శాంపిలు తీసుకురా!—

చెవ : చిత్తం! (M. B లోకి వెళతాడు.)

నారా : మీమాట చాలదుటండీ?—మళ్ళీ శాంపిలెందుకూ?

ధన : చిత్తం!—అయినా చూడ్డం వ్యాపారలక్షణం! వీరెవరూ?

నారా : ఇతను నాప్రాణస్నేహితుడు. పేరు రామారావు.

ధన : బాగుంది!— ఏంచేస్తుంటారు?

నారా : మంచి రసజ్ఞుడు. బాగా కవిత్వం రాస్తాడు!

ధన : (జాలిగా) పాపం!—ఏంఉద్యోగం లేదుగావును!

నారా : మొన్ననే B. A పేసయ్యాడు. ఉద్యోగంకోసం వెతుకుతున్నాడు.

ధన : ఖర్మ!— B. A. కూడా అయిపోయిందీ?— అయితే ఇక ఉద్యోగం దొరికినట్టే!—

నారా : ఏం? బాగా అన్నారు!

ధన : రోజులు అల్లాడున్నాయి! (చెవలయ్య M. B.లోంచి పళ్ళెంలో బియ్యం తీసుకుని వస్తాడు) ఆ!—వారికి ఇయ్యి!

నారా : (చూసి) ధర ఎంతండి?

ధన : తమకి ఎంతో చెబుతానాండీ? వందచేసి తీసుగోండి.

రామా: వంద కెన్ని బస్తాలండి?

ధన : బస్తా వందరూపాయలండి!

రామా: అబ్బా!—అయిదుబస్తాలూ అయిదువందలన్నమాట!

ధన : అంతేనండి!—(కొంచెం విసుగ్గా, చెవలయ్యతో) ఒరేయి, బియ్యం మళ్ళీ జాగ్రత్తగా బస్తాలో పోసెయి! (చెవలయ్య M. B. లోకి పోతాడు.)

నారా : ధర మరీ ఎక్కువ చెబుతున్నారు.

ధన : తమరుకూడా అల్లాసెలవిస్తే ఎల్లా చెప్పండి?

రామా: పోనీ తొంభై చేసి తీసుగోండి.

ధన : కిడితే ఇవ్వనూ?—తమరు మళ్ళీ అడగాలా?

నారా : సరేలెండి. ఏంజేస్తాం?— అవసరంమాది; అవకాశం మీది. అల్లానే ఇప్పించండి!

ధన : చిత్తం! మీ బండి ఏదైనా వచ్చిందాండి?

నారా : కిరాయిబండి వచ్చిందండి!—కాని!—

ధన : ఏమిటి సందేహిస్తున్నారు?

నారా : ఏంలేదూ!—డబ్బు మీకోగంటలో పంపిస్తాను.

ధన : అదా!—కాని, చూశారూ!—తమతో పరిచయం అవడం ఇదే మొదటిసారి. అంచేత ఈసారికి డబ్బిచ్చేసి పట్టించుకెళ్ళండి!

నారా : మామాటమీద నమ్మకం లేదా, మీకూ?

ధన : (మంచిగా నవ్వి) ఎంతమాటన్నారు!

నారా : తీరా ఈవూరొచ్చాక అర్జంటని ఈకబురు చక్కా—వచ్చింది. ఈ ఊళ్ళో పట్టా భోగారావుని ఎరుగుదురా?

ధన : ఆ!—జమీందారుగారు, కదండీ!

నారా : వాడు నాస్నేహితుడు. పోనీ వాడిదగ్గర డబ్బుచ్చుకుందాం అని వెళితినిగదా, వాడింట్లో లేడు. అరగంటదాకారారన్నారు!

ధన : అల్లానా?—పోనీ అరగంటతరవాతే వచ్చి తీసుకువెళ్ళండి!—ఆ బియ్యమే వేరే తీయించి రెడీగాఅట్టేపెడతాను.

నారా : (కైముచూసుకుని) బండి మావూరు వెళ్ళడానికి కనీసం మూడుగంట లేనా పడుతుంది. మధ్యాహ్నం పన్నెండు లోపల బియ్యం అక్కడకి చేరితీరాలి!—అప్పుడే తొమ్మిదవుతోంది! (ఆదుర్దగా ఆలోచించి) పోనీ, ఓపనిచేస్తారా?

ధన : ఏమిటి?

నారా : ఇప్పుడు వెంటనే బియ్యం పంపించెయ్యండి. నేను భోగారావుదగ్గర కెళ్ళి డబ్బు తీసుగొస్తాను. అంత వరకూ నా స్నేహితుడు హామీ క్రింద ఇక్కడుం టాడు!–సరేనా ?

ధన : (మొహమాటంగా నవ్వుతూ) అందుకోసం కాదండీ!–

నారా : ఫరవాలేదులెండి! మొహంచూసినా తెలియని వాడికి మీరు మాత్రం అరువెల్లా ఇస్తారు, చెప్పండి! అం చేత నేను డబ్బు తెచ్చేదాకా ఇతనిక్కడుంటాడు. ముందు మీరు బస్తాలు పంపించండి, అర్జంటు!– ఏమోయి. రామం!–ఉంటావా ?

రామం: అవసరమైనప్పుడు ఆదుకోకపోతే ఇంక స్నేహితు డెందుకు ? తప్పకుండా ఉంటాను!–కాని, నువ్వు వెంటనేరావాలి సుమా!

నారా : నిమిషాలమీద వచ్చెయ్యనూ ?– నిన్నిక్కడ వదిలి వెడితే, నాకుమాత్రం తోస్తుందా ?

ధన : (చిరునవ్వుతో) స్నేహం అంటే అల్లాఉండాలి! ఒరేయి, చెవలయ్యా!

చెవ : (M.B లోంచి వస్తూ) బాబయ్య!

ధన : ఒరేయి, దొడ్డితలుపుతీసి, అయిదు కిచిలీబస్తాలు, మంచివి–లోపలివి!– బండిలో కెక్కించు!– అర్జంటు

చెవ : మనబండేనాండి ?

ధన : మనబండికాదురా!– జమీందారుగారిబండి దొడ్డి గుమ్మంలోఉంది!

చెవ : సిత్తం! (R.F. లోకి వెడతాడు.)

ధన : అన్నట్లు, సంచులు మళ్లీ సాయంత్రంలోగా పంపించెయ్యాండేం?

నారా : తప్పకుండా పంపిస్తాను. ఇంతసాయం మీరు చేసినందుకు, నేనుచాలా కృతజ్ఞుణ్ణి!

ధన : దానికేముందండి!- అవాంతరాలు ఎంతవారికేనా తప్పవు.

రామా: నువ్వు తొందరగా రావాలోయి, మరీ!

నారా : బాగానేఉంది!- బండి బయల్దేరాలా!- మావాడు మరీ మొహమాటం మనిషండీ!

ధన : (చిరునవ్వుతో) తెలుస్తూనేఉందిగా!- అయినా ఇదేమీ పరాయిచోటు కాదు;. మీ ఇల్లేఅనుకోండి!

ప్రసా : (R F. లోంచి హడావుడిగా వస్తూ) బావా!- బావా!

ధన : ఏరా?

ప్రసా : మరే!- చెవలయ్యో!- దొడ్డితలుపు బార్లాతీసి, బస్తాలన్నీ బండిలోకి ఎక్కించేస్తున్నాడు, బావా!

ధన : నేనే చెప్పాలేరా!

ప్రసా : అదా!- ఎన్నెక్కించమన్నావు?

ధన : అయిదు.

ప్రసా : అప్పుడే రెండెక్కించేశాడు- మరి!

ధన : దగ్గిరుండి చూడు-మరీ!

ప్రసా : అల్లానే, మరీ!– (తిరిగి తొందరగా R. F. లోకి వెళ్ళిపోతాడు.)

రామా: ఇతనెవరండీ ?

ధన : నాబావమరిది, ప్రసాదం. పైకి అల్లా మెత్తగా కనిపిస్తాడా. డబ్బుదగ్గిరమాత్రం మహాగట్టి. పైగా మంచి ఆస్తిపరుడు. ఈపడే మా అమ్మాయి నిచ్చి పెళ్ళి చేద్దాం అనుకుంటున్నాను.

రామా: (అదిరిపడి) ఆ !–

ధన : ఏం, అలాఅంటారు ?

నారా : అహా !– సంబంధం చాలాబాగుందీ అంటున్నాడండి.

ధన : చిత్తం! ఏదో అంతా పరమేశ్వరుడిదయ!–ఈపెళ్లి కాస్తా జరిగిపోయిందా నాకింక ఏచింతా ఉండదు. అమ్మాయికి తల్లిలేదు. వాడికా ఇంకెవ్వరూలేరు. నాకున్నది గుండెజబ్బు. అంచేత ఇద్దర్నీ ఇక్కడే పెట్టుగుని కృష్ణా, రామా అని కూర్చుంటాను. అంతే!–

నారా : ఎల్లాగేనా అదృష్టవంతులు మీరు!

చెవ : (R. F. లోంచి వచ్చి) బస్తా లెక్కించేశాను, బాబయ్యా!

ధన : అప్పుడే ఎక్కించేశావురా!

చెవ : మాగిలకయ్యా, నేనూ ఎక్కించేశామండి. అయిదెంతసేపుండీ? భుజమ్రటా గిలకయ్యా అన్నానండి. హేసెయ్యేరా సెవలయ్యా అన్నాడండి. ఇద్దరం బరబరా నాగేశాం!

[R F. లోంచి "చెవలయ్యా!- చెవలయ్యా!" అంటూ అదేపనిగా పిలుపు అందించుగున్న ప్రసాదం గొంతుక వినిపిస్తుంది.]

ధన : ఇంకవాడు ఆగడు, ఖర్మ! ముందువెళ్ళి సంగతేమిటో కనుక్కో!

చెవ : చిత్తం! (విసుగ్గా R. F. లోకి వెడతాడు. కేకలు మెల్లిగా తగ్గుతాయి)

నారా : మరి నేను వెళ్ళొస్తానండి!

ధన : తొందరగా వెళ్ళిరండి. సంచులు సాయంత్రంలోగా పంపించేలా చూడండేం?

నారా : అల్లాగేనండి. వస్తానోయి, రామం!

రామా: త్వరగామాత్రం రా!

[నారాయణరావు చిరునవ్వుతో తలఊపి L. F. లోకి వెడతాడు. రామారావు మొహమాట పడుతున్నట్టు కనిపిస్తూ గుమ్మాలకేసీ, కిటికీల్లోకి చూస్తుంటాడు. ధనరాజు కట్టకుర్చీలో జేరి ఇతని అవస్థ చూసి కొద్దిగా నవ్వుతాడు.]

ధన : అల్లా మొహమాట పడతారేమిటండీ [illegible]గా కూర్చోండి!

రామా: అల్లాగేనండి!

ధన : మీాదీ గోపారమేనాండీ ?

రామా: అవునండి.

ధన : అయితే ఏ ఖైబస్త్రాలు దానాలిచ్చే ఆ నోము ఏమిటండీ ?

రామా: అదేనాండీ ?– అదీ !– అదోరకం నోమండి!

ధన : దాని పేరేమిటండీ ?

రామా: అదాండి ?—అది!—(అని అవస్థ పడుతూంటే R. F లోంచి 'బావా, బావా!' అంటూ హడావుడిగా వచ్చి, రామారావుని చూసి నవ్వుతాడు.)

ప్రసా : ఇదేమిటి ? ఇంకా ఇక్కడున్నారేం ? బండెళ్ళిపోయింది.

ధన : తెలుసులేరా ! నువ్వెందుకొచ్చావు ?

ప్రసా : అదా ! మరే శాంత పరవాణ్ణం కాస్తోంది. (చూపిస్తూ) ఇంత జీడిపప్పు వేసింది ?

ధన : (కోపంగా) ఎక్కడిదీ ?

ప్రసా : నేను కొన్నాను.

ధన : ఖర్మ ! ఎందుకొన్నావురా ?

ప్రసా : పరవాణ్ణంలో వెయ్యడానికి.

ధన : ఏడిసినట్టే ఉంది !

ప్రసా : (చిరునవ్వుతో) నీకేం తెలుసూ ? తియ్యగానేఉంది !

ధన : (విసుగ్గా) నోరుముయ్యి !

ధనరాజుని కోపంగా చూసి ప్రసాదం రామారావు కేసి చూసి నవ్వుతాడు.]

ప్రసా : మీ పేరేమిటండీ?

రామా: రామారావు.

ప్రసా : నా పేరు ప్రసాదరావు.

రామా: బాగుంది కూచోండి. (ప్రసాదం ఠీవిగా కుర్చీలో కూచుంటాడు) మీరు ఏం చేస్తున్నారూ?

ప్రసా : (మంచిగా) కూచున్నాను!

రామా: అదికాదు. ఏమన్నా చదువుకొంటున్నారా?

ప్రసా : అదా?-నాకేం ఖర్మం!- నాకు బోల్డు డబ్బుంది.

రామా: అయితే వ్యాపారం చేస్తున్నారా?

ప్రసా : నాతరం కాదు బాబూ! వ్యాపారం అంటే మాట్లాండీ? అబద్ధాలాడాలి దొంగలెక్కలు రాయాలి. ఎంత గొడవ? అబ్బో, అదంతా పెద్దాళ్ళపని—మా భావ బాగా చేస్తాడు!

ధన : (విసుగ్గా కుర్చీలోంచి లేస్తూ) మావాడు చేరితే కాల క్షేపానికి లోటులేదు. కానిస్తుండరా! నేను వెళ్ళి స్నానం చేసివస్తాను. ఈలోగా జమీందారుగారు వస్తే కూచోమని చెప్పండి.

[ఇంతలో "నాన్నా! నాన్నా!" అని పిలుస్తూ శాంత సంతోషంతో M.B. లోంచి వస్తుంది. ముందర రామారావుని చూడనట్లు నటించి చూసిన తక్షణం కంగారుపడ్డట్టు వెనక్కి తగ్గుతుంది. రామారావు ఉత్సాహంతో చూస్తాడు.]

ధన : వెళ్ళిపోకు, శాంతా!- రా!- పరాయివాళ్ళేవరూ కాదులే! (కొద్దిగా నవ్వి) ఏంకావాలి?

శాంత : (M. B. లో గుమ్మందగ్గిరే నిలబడి) ఇల్లారా, నాన్నా! (ధనరాజు సిగ్గుపడుతున్న శాంతను చిరునవ్వుతో సమీపిస్తాడు) చెయ్యిపట్టు !

ధన : ఏమిటమ్మా అది ?

శాంత : అక్షింతలు ! (ధనరాజు పుచ్చుగుంటాడు) ఈ వేళ నా పుట్టినరోజు కదూ !

ధన : (సంతోషంతో) అదా!- (శాంత, ధనరాజు కాళ్ళకి నమస్కరిస్తుంది) సకల ఐశ్వర్య ప్రాప్తిరస్తు! (అంటూ అక్షింతలు వేసి) మీ మావయ్యకు కూడా నమస్కారం చెయ్యమ్మా !

శాంత : ఇల్లారా మావయ్యా !

ప్రసా : నేను రాను, బాబూ !

ధన : అదేమిటి, రారా !

ప్రసా : నమస్కారం మధ్య నాకెందుకు, బావా!

ధన : బెట్టుసరి చాలుగాని, రా ఇల్లాగ!

[ప్రసాదం సిగ్గుపడుతూ వచ్చి శాంత ఇచ్చిన అక్షింతలు పుచ్చుకొంటాడు. శాంత ప్రసాదానికి నమస్కరిస్తుంది. ప్రసాదం రామారావుకేసి తిరిగి నవ్వుతూంటాడు.]

...అల్లా నుంచుంటావేరా ? (కోపంగా) అక్షింతలు వెయి !

[ప్రసాదం హడిలిపోయి అక్షింతలు ధనరాజు నెత్తిమీద వేసేస్తాడు.]

...ఖర్మ! నామీాద వేస్తావేమిట్రా ?

ప్రసా : (ధనరాజు తలమీాద అక్షింతలు ఏరేస్తూ) ఒహో ! ఆదాకి మర్చిపోయాను, నేను! (శాంత తలమీాద వేస్తాడు.)

శాంత : (చిలిపిగా నవ్వుతూ) రేపు అత్తయ్యవచ్చి చెవులు మెలెడితే మావయ్యగారి బెట్టుసరన్నీ చప్పగా అణిగిపోతాయి.(అంటూ M. B. లోకి వెళ్ళిపోతుంది)

ప్రసా : (తెల్లబోయి చూస్తూ) అత్తయ్య అంటుం దేమిటి, బావా? మళ్ళీ అదెవరూ?

రామా: (నవ్వుతూ) మీ ఆవిడ!

ధన : ఆ! కట్టుపిల్ల, ఏదో వేళాకోళానికి అంటే అంత కంగారు పడతావేరా, మరీనూ?

ప్రసా : వేళాకోళమా? (తేలిగ్గానవ్వి) వోరి! మరల్లా చెప్ప దేం ?

ధన : నేను చెబుతున్నాగా? ఆ సంగతి నా కొదిలెయి. నాదీ పూచీ!

ప్రసా : ఓ అల్లానే.

ధన : చెవలయ్యా! చెవలయ్యా!

చెవ : (R. F. లోంచి వస్తూ) బాబయ్యా!

ధన : నీళ్ళు తోడావురా ?

చెవ : తోడానండి!

ధన : సరే! ఇంకను వ్వెళ్ళిజాగ్రత్తగావీథిఅరుగుమీదకూచో!– ఒరేయ్!–ఇల్లా లోపలికి రా, చెప్తాను! (ఇద్దరూ R. F. లోకి వెడతారు. కొద్ది క్షణాల్లో చెవలయ్య మంచి నక్కపిల్లి కర్రలాంటిది పుచ్చుగుని R.F. లోంచి వచ్చి, రామారావు కేసి చూసి, తలపంకించి L.F లోకి వెడతాడు. రామారావు నిర్లక్ష్యంగా నవ్వుతాడు.)

ప్రసా : (రామూరావు దగ్గరకి ఉత్సాహంతో వచ్చి) మా అక్కయ్యకూతురు!

రామూ: ఎవరూ ?

ప్రసా . ఇప్పుడొచ్చి దణ్ణంపెట్టిందీ?- అది!-

రామూ: ఒహో !

ప్రసా : నేనంటే ప్రాణం ఇచ్చేస్తుంది.

రామూ: ఆ !

ప్రసా : ఆ !- మొన్న దొడ్లో నూతిగట్టుమీద నేను జారి పడితే, అది ఎంత బాధ పడిందనుకున్నారు? (కొంచెం దగ్గరగా జరిగి. ఇటూ అటూ చూసి, ఉత్సాహంగా) మాబావే !- అదే ప్రేమని చెప్పాడు.

రామూ: ఎదీ ?

ప్రసా : (విసుగ్గా) అదే! - మీకు పెళ్ళయిందా?

రామూ: అవలేదు.

ప్రసా : అందుకనే మీకు తెలియదు.

రామూ: నీకూ అవలేదుగా?

ప్రసా : (నవ్వి) అందుకనే నాకూ తెలియదుగా? (M.B లోంచి 'మావయ్యా!'అని శాంత పిలుపు) ఇప్పుడే వస్తాను.

[ప్రసాదం M. B. లోకి వెడతాడు. రామూరావు M. B. కేసి చూసి నిట్టూర్చి జేబులు తడుముకుని L. F. కేసి నడుస్తూంటే, చెవలయ్య L. F. లోంచి కర్రుచ్చుగుని ఎదురొస్తాడు ]

చెవ : య్యాడకి బాబూ, బయల్దేరారూ ?

రామూ: సిగరెట్లయిపోయాయి.

చెవ : అట్టాగా? అయినాసరే తమరు కూర్చోండి, బాబూ! డబ్బు లిట్టా ఇవ్వండి, నాను తెప్పించిపెడతాను.

రామా: (నిట్టూర్చి) సరే!– (రూపాయినోటుతీసి) బర్ల్లో పెట్టి, అగ్గిపెట్టి తెప్పించు!–

చెవ : సిత్తం! వెంక్ లే!– (అనుకుంటూ L. F. లోకి వెడతాడు.)

[రామారావు చిరునవ్వులో పచార్లుచేస్తూంటాడు. ప్రసాదం M. B. లోంచి మిఠాయిప్లేటు చొక్కాకింద దాచిపట్టుగుని, నోట్లో మిఠాయి గబగబా నమిలేస్తూ వస్తాడు]

ప్రసా : నేనేం తెచ్చానో చెప్పుకోండి!

రామా: మిఠాయిఉండలు.

ప్రసా : అమ్మబాబో!– మీకెల్లా తెలుసూ?

రామా: నీబుగ్గలనిండా కనిపిస్తూంటేనే!

ప్రసా : (ప్లేటు ఇవతలకితీసి, చిన్నబల్లమీద పెడుతూ) మాంఛ లేవారే మీరు!

రామా: ఇవన్నీ ఎందుకు?

ప్రసా : తిండానికి!–

రామా: నాకు తీపి సయించదు.

ప్రసా : సయించకపోయినా తినాలి!– ఈవాళ మాశాంత పుట్టింరోజు.

రామా: అయితే ఒక్కటి తీసుకుంటాను.

ప్రసా : పోనీ, మిగతావన్నీ నేను తీసుకుంటాను– ఏం!

[రామారావు నవ్వి ఓసారి కళ్ళు మూసి నోట్లో వేసుకుని M. B. గుమ్మం వెనకనించి ఓరచూపులు చూస్తున్న శాంతవైపు ఉత్సాహంతో చూస్తూ ఉంటాడు. ప్రసాదం ఒక ఉండ, ఆబగా నోట్లోకి విసురుకుని, కొంచెం తిని మింగేస్తాడు.]

ఎల్లాఉంది?

రామా: (శాంత కేసి చూస్తూ) మనోహరంగా ఉంది! (శాంత సిగ్గుపడి పక్కకి తప్పుకుంటుంది)

ప్రసా: (తన్మయత్వంలో) అవునామరి!– అందుకనే పొద్దుణ్ణించీ పన్నెండు తిన్నాను. (ఎక్కుతాడు.) ఓనాడు ఏమయిందీ?– (మళ్ళీ ఎక్కుతాడు)– గాభ్రాంశింది.

(తిరిగి ఎక్కుతాడు)

రామా: (ప్రసాదం ఎక్కిళ్ళు గమనించి) అదేమిటీ?

ప్రసా: (చిరునవ్వుతో) కడుపులో మిఠాయిఉండలు దెబ్బలాడుకుంటున్నాయి!– (పెద్దగా ఎక్కుతాడు.)

[ప్రసాదం రెండుగుడ్లూ తేలేసి, మొహం ఆదోలా పెట్టి మళ్ళీ ఎక్కుతాడు. రామారావు ఆదుర్దాగా వెళ్ళి ప్రసాదాన్ని పట్టుకుంటాడు.]

రామా: ఇల్లాకూర్చో! (ప్రసాదాన్ని ఓకుర్చీలో కూలవేస్తాడు.)

ప్రసా: ఆగాల్లే!– (ఎక్కుతాడు)

రామా: పోనీవయ్యా, దిక్కుమాలినగాల్లూ! కాస్సేపు మర్చిపో! ఇలాకూర్చో!

ప్రసా: (చేత్తో నోరుమూసుకుని, గట్టిగాఎక్కి) చచ్చాను!– (అని మాటరాక మంచినీళ్ళన్నట్లు సంజ్ఞ చేస్తాడు.)

రామా: (కంగారుగా) మంచినీళ్ళా?- (ఏంతోచక) మంచి నీళ్ళు!- మంచినీళ్ళు! (అని ఇటూ అటూ చూసి, ప్రసాదం ఎక్కిళ్ళు ఆగకపోవడం గమనించి భయంతో M B. కేసి పరిగెడతాడు. వెంటనే శాంత M B. తలుపు వెనకనుంచి వచ్చి, నీళ్ళతో ఉన్న గ్లాసు అందిస్తుంది. రామారావు అదేమిటో గమనించకుండా పుచ్చేసుగుని, కంగారుగా) మీ మామయ్యకు ఎక్కిళ్ళు వస్తున్నాయి. మంచినీళ్ళు కావాలి!- (శాంత సిగ్గుపడి చిరునవ్వుతో రామా రావు పట్టుగున్న గ్లాసు కేసి చూపిస్తుంది) ఓహో!- (అని నెర్వస్‌గానవ్వి) మర్చిపోయాను!-(తొందరగా వెళ్ళి ప్రసాదానికి ఇచ్చి పట్టించి గుండెరాస్తాడు.)

శాంత : (అక్కడనుంచే) ఇప్పుడెల్లాఉంది, మావయ్యా!

రామా: (చిరునవ్వుతో) మనస్సు ఇంకా ఆరాట పడుతూనే ఉంది!

ప్రసా : వెధవమనస్సు పోనిద్దూ! కడుపు కుదుటపడిందిగా?- మిగతావన్నీ అవేసద్దుకుంటాయి!- (అని హాయిగా నవ్వుతాడు.)

[చెవలయ్య L. F. లోంచి సిగరెట్టు పెట్టి, అగ్గిపెట్టి తీసికొని వస్తాడు. శాంత గ్లాసుపుచ్చుగుని M. B. లోకి వెళ్ళిపోతుంది.]

చెవ : (ఇస్తూ) ఇయిగో, బాబయ్యా! (రామారావు పేకెట్టువిప్పి సిగరెట్టుతీసి నోట్లోపెట్టుగోబోతాడు.)

ప్రసా : ఉండండి. అప్పుడేకాల్చకండి!— శాంతా!— శాంత (అంటూ M. B. గుమ్మందాకా వెళ్ళి గుమ్మంఅవత యున్న శాంతతో ఏదో చెప్పి వెనక్కివస్తాడు చెవలయ్యా!— అమ్మాయిగారు పిలుస్తున్నా లోపలికి వెళ్ళు!

చెవ : ఆవి డెక్కడ పిల్చారండి నన్ను !—

ప్రసా : (ఆలోచించి) నేను పిలుస్తున్నాను, ఇల్లా రా !—

చెవ : (దగ్గరకొచ్చి) ఎందుకండి?

ప్రసా : (M. B లోకి చూపెట్టి) లోపలి కెళ్ళు!— (చెవలయ విసుగ్గా చూసి M B. లోకి వెళతాడు.)

రామా: ముత్తాసకి భ లేవాడివే నువ్వు!

ప్రసా : నేనెప్పుడూ అంతే! ఆ!-ఇందాక ఏంచెబుతున్నాన మీాకూ? ఆ!-గార్లు! గార్లు!

రామా: నీకూ ఆగార్లకీ ఓదణ్ణంగాని మహోమాట ఏదైన చెబుదూ!

ప్రసా : ఏం? మీాకు గార్లు సయించవా?

[ధనరాజు RF లోంచి వస్తాడు స్నానం చేసి బట్టలు వేసుకు ఉంటాడు.]

ధన : ఏరా, ప్రసాదం? ఎక్కిళ్ళు వచ్చాయిట!

ప్రసా : రావడమేమిటి, బావా! అసలు పోయేవాణ్ణి; పాప ఈయనే ఆపేశాడు.

ధన : (కుర్చీలో కూచుంటూ) ఏమండీ. జమిందారుగారు వచ్చారా ?

ప్రసా: జమిందారుగారు ఎవరు, బావా ?

ధన : నీకు తెలియదులే !

ప్రసా : తెలియకపోతే అడగమన్నావుగా ? (ధనరాజు కోపంగా చూస్తాడు. ప్రసాదం కళ్ళు మిటకరించి రామారావు వెనక్కి తప్పుకుంటాడు.)

రామా: అతని కోసమే చూస్తున్నానండి, ఇంకా రాలేదు. అవతల నాకు బోల్డు పనుంది.

ధన : ఖర్మ! వస్తాడులెండి. తొందర పడకండి! పాపం, ఆ భోగారావు ఇంకా రాలేదేమో !

రామా: ఏం భోగారావో ఏమిటో ! నాకుమాత్రం ఇలా కూర్చోడం మా చెడ్డ ఇదిగా వుందండి. మీ కందరికీ ఎంత ఇబ్బంది కలిగిస్తున్నానో ఏమిటో!

ధన : ఆ, ఫరవా లేదండి.

ప్రసా : మరే!— ఓ మిఠాయి ఉండేనా తినం దే, మన కిబ్బం దేమిటీ ?

ధన : ఒరేయి, నువ్వూరుకో!

రామా: ఈ సంగతంతా వింటే నాగురించి ఏమనుకుంటారు, చెప్పండి.

ధన : మీఇల్లు బంగారంగానూ ! ఇంత మొహమాట మేమిటండీ?—వింటేమాత్రం?— స్నేహితుడికి సహాయం

చేశాడు అనుకుంటారు. పైగా, అసలు వినడానికి ఎవరేనా చెప్తేగా? మనలో మనకేమిటండీ!—ఒరేయి ప్రసాదం!

ప్రసా : ఏం బావా? (చెవలయ్య కాఫీ లుచ్చుకుని M.B. లోంచి వస్తాడు.)

ధన : వీరు మన స్నేహితులు. చూడ్డానికి వచ్చారు. ఇందాకా వెళ్ళిన బియ్యంబస్తాలకీ ఈయనకీ ఏమీ సంబంధంలేదు. తెలిసిందా?

ప్రసా : ఓ!—అయితే ఇందాకా బస్తాలు మన కొట్టుమీదకి పంపించావా?

ధన : (విసుగ్గా) ఏదో చేశాను! (చెవలయ్యతో) విన్నావా చెవలయ్యా!

చెవ : సిత్తం, బాబయ్యా!

ధన : (కాఫీలు చూసి, లేస్తూ) ఇదేమిట్రా?— ఎవరు తెమ్మన్నారు?

చెవ : ప్రసాదంగోరండి!—

ధన : ఉహూ! వీడొచ్చి కాఫీ లొకటి లేవదీశాడు, ఈలోంపలో!—

ప్రసా : ఏం? నాడబ్బేగా?

ధన : నీడబ్బయితేమాత్రం నిప్పెట్టాలని రూలుందా! ఎందుకొచ్చిన కాఫీలా ఇవీ? నిక్షేపంలాంటి పాలుతాక్క—

అందులో ఇన్ని చేదునీళ్ళు కలుపుగోడం ఎందుకూ? మళ్ళీ ఆ చేదు పోడానికంటూ ఇంత పంచదార పోసుగోడం ఎందుకూ?- ఎవడ్రా ఈ కాఫీలు కని పెట్టిన చవట!

ప్రసా : అదీ తెలియదూ?- వీరె కనిపెట్టాడు, బావా!- దొర!

ధన : ఏడవలేకపోయాడు! అసలు గవర్నమెంటు ఆతాగుడుతోపాటు, ఈ కాఫీకూడా నిషేధిస్తే బోల్డు మధ్య తరగతి కుటుంబాలు బాగుపడి ఉండేవి.

ప్రసా : అది సరేగాని, బావా! పంచదార ఎక్కువేయించి స్ట్రాంగుగా కలిపించాను. ఓకప్పుచ్చుగో!

ధన : నాకక్కర్లేదు.

ప్రసా : పోసి మీరుచ్చుగోండి!

రామా: నాకూవద్దు!

ప్రసా : (బాధగా) అదేమిటండీ?- ఈ వేళ మా శాంత పుట్టిం రోజు, శాంత ఇచ్చిందేమీ వద్దనకూడదు.

రామా: వారు తీసుగోకపోతే, నేనూ తాగను.

ధన : అబ్బే! మీరు మా నెయ్యుడ మేమిటి? ఏదో మాట వరసకి అన్నాను. పుచ్చుగోండి!

శాంత : (M. B. తలుపుదగ్గిర్నుంచి) నువ్వుకూడా తీసుగో, నాన్నా!

ధన : నా కొద్దమ్మా!

శాంత : తీసుగోకపోతే నామీదబట్టే!
ధన : అంతకోపం ఎందుకే?
చెవ : అవునుబాబయ్యా!– ఓసుక్కోసుగోండి!
ధన : ఏడిశావులే, ముందు వారికియ్యి!

[ధనరాజు, ప్రసాదం, రామారావు కాఫీలు తాగుతూంటారు శాంత, రామారావుని చూసి కొద్దిగానవ్వి, తలుపువెనక్కి తప్పుగుంటుంది. ప్రసాదం తనకోసమే నవ్వింద నుకుంటాడు.]

ప్రసా : (ఉత్సాహంగా) చూశారా!– చివరికి వీళ్ళంతా ఒక్కటే! మనమే పరాయివాళ్ళం. దీపముండగానే ఇల్లు చక్కబెట్టుగోమన్నాడు. ఒరేయి, చెవలయ్యా!– మళ్ళీ మా ఇద్దరికీ చెరోగ్లాసుడు కాఫీ పట్టుగొచ్చెయి!
ధన : ఇంకా ఎందుకురా? కాఫీఅంటే లాంఛనానికి ఏదో ఆమాత్రం పుచ్చుకోవాలిగాని కుడితెతాగినట్టు తెగ తాగుతే, గుండె ఆగి ఊరుకుంటుంది.
ప్రసా : (నాలిక ఝాడించి) ఆ!– మళ్ళీ గుండె కూచో పెడితే అదే ఆడుతుంది! పట్రారా, చెవలయ్య!
రామా: నాకు మాత్రం ఇంకొద్దు!
ప్రసా : పోనీ నాకు తెచ్చిపెట్టు! (చెవలయ్య తలఊపి M.B. లోకి వెడతాడు.)
ధన : ఖర్మ!– ఏది పట్టుకుంటే అదే!

[ధనరాజు చుట్టతీసి కొరుకుతాడు. రామారావు సిగరెట్టు తీస్తాడు. ధనరాజు తీసిన అగ్గిపెట్టి దాచుకుని, రామారావు తీసిన అగ్గిపెట్టిముష్టి అడిగి చుట్ట అంటించుకుంటాడు.]

ప్రసా : (పొగ చూస్తూ, మెచ్చుకుంటూ) ఆ సిగరెట్టు ఎంతండీ?

రామా: అర్ధణా!

ప్రసా : అమ్మబాబో!- అర్ధణాయే!-మా బావ కాసీక్కి నాలుగు చుట్టలు కాలుస్తాడు!

[L. F. అవతలనుంచి "ధనరాజు గాయా!-" ధనరాజుగారు!- అని పిలుపు]

ధన : (విసుగ్గా) అబ్బ! చెవికోసిన మేకల్లా ఏమిట్రా ఆ వాగుడూ? ఎవరో వచ్చినట్టున్నారు, పోయి చూడు!

ప్రసా : (చిరికోపంతో చూసి. M. B. కేసి తిరిగి) చెవ లయ్యా!-చెవలయ్యా!

చెవ : (M. B. లోంచి కంగారుగా వచ్చి) వత్తున్నానండి, బాబయ్యా!-వత్తున్నాను, ఎందుకండి!

ప్రసా : అబ్బ!- చెవికోసిన మేకల్లా ఏమిట్రా ఆవాగుడూ?- (L. F. లోకి చూపిస్తూ) ఎవరో వచ్చినట్టున్నారు, పోయిచూడు!

చెవ : (ఆశ్చర్యంగా, విసుగ్గా చూసి) సిత్తం! L. F. లోకి వెడతాడు. ధనరాజు కోపంగా చూస్తాడు.

ప్రసాదం పోయిగా, నిశ్శబ్దంగా వస్తుంటాడు. చెవ లయ్య (L. F. లోంచి వస్తాడు.) భోగారావుగారి బంట్రోతు చింతయ్య వచ్చాడండి.

ధన : (హుషారుగా లేస్తూ) ఓహో!- డబ్బు తీసు గొచ్చి ఉంటాడు! రమ్మను, రమ్మను!

[చెవలయ్య ఉత్సాహంతో L. F. లోకి వెడతాడు. వెంటనే చింతయ్యతో తిరిగి వస్తాడు.]

చింత : దణ్ణాలండి!

ధన : నువ్వు-భోగారావుగారి నౌఖరువా?

చింత : సిత్తం! నాపేరు సింతయ్యండి.

ధన : సరేలే! డబ్బట్టుగొచ్చావా?

చింత : నేదండీ!-

ధన : మరి?-

చింత : కబురట్టుగొచ్చానండి,

ధన : ఏమిటది?

చింత : ఇందాకా నారాయణరావుగారికి అర్జంటుగా రమ్మని ఆరి ఊర్నించి కబురొచ్చిందంట! - ఆరెడుతూ సన్నీ ముక్క మీతో సెప్పమన్నారు.

ధన : (అనుమానంగా) ఏమిటా ముక్క?

చింత : రేపు ఉదయం అయ్యాటప్పటికి డబ్బట్టుకుని వచ్చే త్తారంట!- అంతవరకూ ఈ అయ్యగార్ని కాస్తా

సుర్మాదగా గొంతుని వీరాతో మరీమరీ చెప్పి
మన్నారు.

ధన : (ఆశ్చర్యంతో) ఏమి టేమిటీ ?- మీ అయ్యగార్నడిగి
డబ్బు పట్టుగొస్తానని వెళ్ళి, ఊరుచక్కా పోతాడూ ?-
ఇదేనా పెద్దమనిషితరహా ?- ఈ సంగతేమిటో
భోగారావుగారినే కనుక్కుంటాను, నడు !

చింత : ఇయ్యాల ఆదివారం కదండీ !- మా అయ్యగారు
ఏటకెళ్ళారండి.

ప్రసా : పాపం !-మళ్ళీవస్తాడో రాడో !

ధన : అబ్బ, నువ్వూరుకోరా !-

రామా: చూశారాండీ, ధనరాజుగారూ !-ఇదేనా మర్యాద ?
నన్నిక్కడ అట్టేపెట్టి తను ఊరు చక్కాపోతాడూ !
స్నేహితుడు కదా అని ఉపకారానికి పోతే ఇంత
అవమానం చేస్తాడా నన్ను !

ధన : (ఏం తోచక, గుటకేసి, విసురుగా చింతయ్యమీద
కేడుతూ) ఇప్పుడు నా డబ్బు మాటేమిటయ్యా ?-
ఒకటా, రెండా, అయిదువందల రూపాయలు పైగా
సంచులూనూ ! అణాపైసల్తో అంతాకక్కవలసిందే.
తెలిసిందా ?

చింత : (చిరాగ్గా) మద్దె నామీద ఎగుర్తారేటండీ ?- అడుగో
అయన్నడగండి !

ప్రసా : (నవ్వి, లేచి) బాగానే ఉంది. వారు మా స్నేహితులు. చూడ్డానికి వచ్చారు. వారికీ ఆ బస్తాలకీ ఏమీ సంబంధం లేదు. కదురా, చెవలయ్యా ?

చెవ : (ఉత్సాహంతో) అంతేనండి!

ధన : (మతిపోయినట్టు చూస్తూ) ఒరేయి, నోరు మూసుకోండిరా, మీ మొహాలు మండిపోనూ!– శనిగాళ్ళలా పోగయ్యారు కదుట్రా నాకు!– ఫోండి లోపలికి !

ప్రసా : (బిక్క–మొహంతో) రారా, చెవలయ్యా!– కాఫీ తాగుదాం!

(ప్రసాదం, చెవలయ్య, M. B. లోకి వెళ్ళిపోతారు)

రామా: చిన్నప్పటి స్నేహితుడు కదా అని నమ్ముకున్నందుకు బాగానే శాస్తి చేశాడు. కాని నేను వెంటనే వెళ్ళిపోవాలి. నేనింకా రాలేదని ఇంటిదగ్గిర నా ముసలి తల్లి ఎంత కంగారు పడుతోందో!–ఏమిటి నాకిప్పుడు దారి? చెప్పండి. ధనరాజుగారూ !

ధన : అబ్బ, ఉండవయ్యా! నాదారే నాకు తెలియక ఛస్తూంటేనూ!– ఏమోయి, చింతయ్యా! ఇల్లారా !

చింత : ఏమండీ?

ధన : అసలు ఆయన జమిందారు కొడుకేనా ?

చింత : ఎవరు? నారాయణరావుగారా?

ధన : ఊ!

చింత : గోపారం జమిందారుగారి కొడుకండీ!

ధన : డబ్బిచ్చేరకమేనా ?

చింత : అదేటండీ, ఎదవ అయిపోందలూ! ఆయన రోజూ పేకాటలో ఎయ్యిరూపాయలు తగలేత్తాడు ?

ధన : రెండువేలు తగలెయ్యమను. ఎవడికి గొప్ప? మర్యాద లేకపోయింతర్వాత! జమిందారు కొడుకుగదా అని అరువిస్తే ఇదేనా చెయ్యవలసినపని? ఇదేనా వ్యాపార లక్షణం? పైగా తనొచ్చేదాకా ఈ మనిషిని ఇంట్లో పెట్టుగుని పెళ్ళికొడుకులా మేపమంటాడూ ?

రామా: (లేచి) మీకంత కష్టం ఎందుకులెండి, నేనిప్పుడే పోతాను!

ధన : (అడ్డమెళ్ళి) మీరల్లా కూర్చోండి బాబూ! ఏదో బుద్ధి గడ్డితిని బస్తాలు వదులుకున్నాను. మిమ్మల్ని కూడా వదుల్తానా? డబ్బూ, సంచులూ పూరాగా ముట్టేదాకా మీరిక్కణ్ణుంచి కదల్డానికి వీల్లేదు! పొద్దున్నే ఎవడి మొహం చూశానోగాని దిక్కుమాలిన బేరం దొరికింది.

చింత : ఏమండోయి, నేను పోతున్నానుగాని, ఈయన గార్ని శానా జాగ్రత్తగా సూడమన్నారు. ఏ మాత్రం అమర్యాద జరిగినా, మర్యాద దక్కదని సెప్పమన్నారు. ఆరి సంగతి మీకు తెల్దేమో. మనిసి

కండశాసనుకు. కోపంవచ్చిందంటే పోడిచేసి మరీ మాట్లాడతాడు.

ధన : పైగా ఇదోటూ, ఖర్మ !

రామా: నాకు ఈ ఇంట్లో ఒక్క క్షణం ఉండాలని లేదు.

ధన : మిమ్మల్ని ఈ ఇంట్లో ఒక్క క్షణం ఉంచుగోవాలని లేదు.

రామా: పోనీ అల్లాంటప్పుడు నిక్కచ్చిగా ఓ ఉత్తరం రాసి పంపించకూడదూ? రేపటిదాకా వీల్లేదు, ఈవాళే వచ్చిచ్చి తీరాలని. మీకు డబ్బొవస్తూంది, నాకీ గొడవా తప్పుతుంది.

ధన : (ఆలోచించి) అదీ నిజమే!—కాని ఇప్పుడు ఉత్తరం పట్టిగెళ్ళేది, ఎవడూ?

రామా: అత నున్నాడుగా ?

చింత : నా నెళ్ళలేను, బాబూ !

రామా: నేను రెండురూపాయ లిచ్చుగుంటాను, వెళ్ళి రావయ్యా !— నన్ని చెరలోంచి తప్పించిన పుణ్యమేనా దక్కుతుంది.

ధన : అవును ! ఆ కుఱ్ఱాడు ఎంత బాధపడిపోతున్నాడో, చూడు! పాపం, అక్కడ వాళ్ళ ముసలితల్లి ఒక్కత్తి ఉందిట, ఆవిడేం బాధపడిపోతోందో !— వెళ్ళి డబ్బట్టుగొచ్చెయ్యి, పాపం ఇంటికిపోతాడు.

చింత : ఏటోగోనవ – సరే ఇవ్వండి !

రామా: నీమేలు జన్మలో మరిచిపోలేను, చింతయ్యా ! పెంద్రాళే వస్తావుకదూ ?

చింత : సంధాళ కొచ్చెయ్యనూ !

ధన : అమ్మయ్య ! ఉత్తరం రాసిస్తానుండు– కాగితం, కలమేదీ ?– (తడుముకుని) ఒరేయి, చెవలయ్యా !

ప్రసా : (M. B. లోంచి గ్లాసుతో కాఫీతాగుతూ వస్తూ) ఏంబావా !

ధన : (విసుగ్గా) నిన్నెవరు పిల్చార్రా ? చెవలయ్యేడీ ?

ప్రసా : గొడ్లసావిట్లో ఉన్నాడు. (అని కోపంగా M. B. కేసి తిరుగుతాడు )

ధన : పోనీ నువ్విల్లారా !

ప్రసా : నన్ను పిలవలేదన్నావుగా ?

ధన : ఖర్మ, రారా, చంపక !

ప్రసా : (వెనక్కొచ్చి) సరే, చెప్పు !

ధన : తొందరగా మేడమీదకెళ్ళి కాగితం, కలం పట్రా !

ప్రసా : ఏంకాగితం ?

ధన : (కోపంగా) తెల్లకాగితంరా !– త్వరగావెళ్ళు ! (ప్రసాదం తల ఊపి కంగారుగా తనచేతిలో ఎంగిలి గ్లాసు ధనరాజుకి అందించేసి మేడమీదకి పరిగెడతాడు.) ఆ !– కుర్రవయస్సైనా మంచి ఆలోచన చెప్పారు. (అంటూ తనచేతిలోఉన్న ప్రసాదం

ఎంగిలిగ్లాసు అప్పుడు చూసుగుని) ఛీ ఛీ !–వీడివన్నీ అర్ధాన్నంపన్లే! (అంటూ గ్లాసు కింద పెట్టేసి చేతులు దులుపుకుంటాడు.) ఆ !– ఉత్తరం రాస్తే సాయింత్రానికి డబ్బొచ్చేస్తుంది. అందులో మీరు చాలా కంగారుపడుతున్నారనికూడా వ్రాస్తాను, ఏం ?

రామా: రాస్తే రాయండి. కాని ఇంక అతణ్ణి ఛస్తేనమ్మను!– నాకు ఎంత మిత్రద్రోహం చేశాడో చూడండి! మీరుగనక సరిపోయింది. మరొకరైతే, నాగతి ఏమయిఉండేది, చెప్పండి !

ధన : అల్లానేమరి !–

[ప్రసాదం కాగితం, కలం పుచ్చుగుని వస్తాడు. ధనరాజు వాటిని పుచ్చుగుని వ్రాయడానికి తయారవుతాడు.]

రామా: ఉత్తరం చూసేటప్పటికి డబ్బుచ్చుగుని పరిగెత్తుకొచ్చేలా రాయాలి !

ధన : (డబ్బుమాటవిని, నెర్వస్‌గాచూస్తూ) ఏంరాయాలో ఏమిటో తోచడం లేదు !

ప్రసా : పోనీ, ఉత్త తెల్లకాగితం పంపించెయి, బావా !– హడిలిపోయి ఆయనే చక్కా–వస్తాడు!

ధన : ఖర్మ, నువ్వూరుకోరా, కాస్సేపు !– పోనీ మీరు చెప్పండి, ఏంరాయాలో !

రామా: అయితే, రాయండి !- గోపారం జమీందారుగారి కుమారుడైన నారాయణరావుగారికి- మీ స్నేహితుడు, రామారావు, మావద్దనే ఉన్నాడు-మీకోసం కలవరించిపోతున్నాడు.

ధన : (రాస్తూ, ఉత్సాహంగా) అదీమాట !- కలవరించి పోతున్నాడు.

రామా: రాశారా ?- ఉ !- మేం అతిజాగ్రత్తగా చూస్తున్నాం- అందుచేత- వెంటనేవచ్చి- అయిదువందల రూపాయలూ చెల్లించి- అతణ్ణి తీసుకు వెళ్ళవలయును.

ధన : (రాసి, చూసుగుని) మరి, సంచీలో ?

రామా: ఆ జమిందారీ కొంపలో ఇప్పుడు సంచులు ఎక్కడ దొరుకుతాయి ?- ఆ సంచీలడబ్బు నేనిస్తాలెండి !

ధన : అయిదు సంచీలు, పదిరూపాయలు !

రామా: (విసుగ్గా జేబులోంచి పదిరూపాయలనోటు తీసి) ఇదుగో, తీసుగోండి !

ధన : (సంతోషంతో పుచ్చుగుని, ప్రసాదానికి చూపిస్తూ) చూడరా, ప్రసాదం !- నిజాయతీ అంటే, ఇది !

ప్రసా : (నోటుకేసి పరీక్షగాచూసి) నీకు మతోయింది. ఇది పదిరూపాయలనోటు!

రామా: ఆ !- ఎంతవరకూ రాశారు ?

ధన : అయిదువందల రూపాయలూ చెల్లించి, అత్త తీసుగు వెళ్ళవలయును.

రామా: ఆ, వెళ్ళవలయును !– తరవాత రాయండి !– ఉకే ష్టి స్తే ఆపైన విచారించవలిసి వస్తుంది– ఇట్లు– విధేయుడు– సంతకం చేసెయ్యండి !

ధన : (పూర్తిచేసి) ఆయన రాడీట !– ఇల్లా బెదిరిస్తే నచ్చి పోడుస్తాడే మోకూడాను, ఖర్మ !

రామా: నే నుంటాకదండీ ?– మీ కెందుకుభయం ?

ప్రసా : నీకేం భయంలేదు, బావా !– నే నున్నానుగా ?– ఆయనొస్తే తలుపు వేసేసి, నువ్వింట్లో లేవని చెప్తాను, ఏం ?

ధన : అబ్బ ! ఊరుకోరా !– (ఉత్తరం మళ్ళీ చూసుకుని) ఉత్తరం ఫస్టుగాఉంది. దెబ్బతో డబ్బు నచ్చేస్తుంది– ఎల్లాగేనా, కవులాయిరి !

రామా: (రెండురూపాయలు, చింతయ్య కిస్తూ, కన్నుగీటి) ఇవుగోనోయి, రెండూను !– చూసిందంతా చెప్తావు, కద్దూ ?

చింత : (గ్రహించినట్లు తలఊపి) సెప్తాను, బాబూ !

ధన : (ఉత్తరం ఇస్తూ) ఈయన్ని నేను బోల్డుమర్యాదగా కూడా, చూస్తున్నానని చెప్పు !– ఆ ?–

చింత : అల్లానేనండి !

ధన : సాయంత్రం తిరిగి రాగానే ముందు తిన్నగా ఇక్కడికే వచ్చాయి !- ఇదుగో, ఉబ్బి స్తేనేగాని, కదల్లకు!

చింత : అసలు, వదల్నండి !

ధన : అదే !- కదలకు- వదలకు !- వస్తే ఆయన్నికూడా రమ్మను !

ప్రసా : అన్నట్లు, చింతయ్యా !- గోపారంలో ములగచెట్లు చాలా ఉన్నాయిటగా ? వచ్చేటప్పుడు, ఇన్ని, ములక్కాడలు కోసుకురా, ఏం ?-

ధన : (కోపంగా)అవతల, అతణ్ణి బోల్డు అర్జంటు పనిమీద పంపిస్తూంటే,ములక్కాడలుకోసుకురమ్మని, సీపుర మాయింపు ఒకటూ ?- బోడిపురమాయింపు !- నువ్వెళ్ళవోయి, వెళ్ళు !

చింత : చిత్తం !- దణ్ణాలండి !- (చింతయ్య L. F. లోకి వెళతాడు.)

రామా: ఇల్లాంటి దురవస్థలో ఎప్పుడూపడలేదు. చెప్పాలంటే సిగ్గుకూడాను !

ధన : దురవస్థ ఏముంది, న్నాయనా ! హాయిగాకూచోండి! ఎరక్కపోయి రౌడీమేళానికి అరువిచ్చి నాకొంప మీదికి తెచ్చుకున్నాను.

శివ : (M. B. లోంచి వచ్చి) భోజనాలకి రమ్మంటున్నారండి !

ప్రసా : అల్లానా ?- వస్తున్నాం !- (హుషారుగా M. B. లోకి చక్కాపోతాడు.)

రామా: (లేచి) నేను అల్లా ఊళ్ళోకి వెళ్ళొస్తానండి.

ధన : మీా రెక్కడికీ వెళ్ళద్దు!— ఖర్మ, మాయింట్లోనే భోంచేద్దురుగాని!

రామా: ఆ శ్రమకూడా ఎందుకూ, మీాకూ?

ధన : (రోషంతో) శ్రమేముందీ?— నాకొంప సత్రమల్లా చేసి ఊళ్ళోఉన్నవాళ్ళందర్నీ పెళ్ళికొడుకుల్లా మేపడం అంటే నాకు మహాచెడ్డసరదా! రండి, బాబూ! కాళ్ళుకడుక్కుందురుగాని!

(చెవలయ్యా, వెనకాల రామారావు R. F. లోకి వెడతారు. ధనరాజు బాధగామూలిగి, తలకొట్టుకుని M. B. లోకి వెడతాడు.)

తెర

—

## 2-రంగం

[ధనరాజు ఇంట్లో అదే హాలు, రామారావు కుర్చీలో కూర్చుని సిగరెట్ కాలుస్తూ హుషారుగా వారపత్రిక తిరగేస్తూంటాడు. అతని ప్రక్క ఇంకా నాలుగైదు వారపత్రికలుంటాయి, ప్రసాదం L.F. కి ఓ చివరగా కుర్చీలో బద్ధకంగా కూచుంటాడు.]

ప్రసా : (తలకాయిలో ఆలోచన మెరిసినట్లు, కళ్ళెగరేసి, నవ్వుతూ, చిటికేసి) ఆ! మర్చిపోయాను, నేనూ! (అని హుషారుగా లేచి M. B. లోకి వెడతాడు. రామారావు చదవడంఆపి, M.B. కేసి చూస్తాడు. ఓ క్షణంలో M. B. లోంచి ప్రసాదం పేకముక్కలు పుచ్చుగుని వాటంగా కలుపుతూ వస్తాడు) పేకాడుకుందామా?

రామా: ఇప్పుడొద్దు. విసుగ్గావుంది.

ప్రసా : ఒక్క ఆట!

రామా: నాకసలు రాదు.

ప్రసా : చివరికింతేనా? పోనీగదా ఓ ఛాన్సిద్దామనుకున్నాను. సరేలెండి. నేనూ వాడూ ఆడుకుంటాం!

రామా: వాడెవడూ?

ప్రసా : నేనూ, మాసత్రకాయి! (అంటూ మరోకుర్చీ తన కెదురుగా వేసి, మధ్యకి మేజాబల్లతోసి, కుర్చీ చూపిస్తూ సూన్యంలోకి సంతోషంగా చూస్తూ) కూచోరా, కూచో! (ప్రసాదం తన కుర్చీలో కూచుని పెద్ద

ఆట గాడి షక్కీలో ముక్కలు తనకీ సత్రకాయికీ తెగ నిర్లక్ష్యంగా పంచేస్తాడు. రామారావు చిరునవ్వుతో ప్రసాదం కుర్చీ వెనుక వచ్చి నుంచుంటాడు. ముక్కలు పంచేసి, తన ముక్కలు అతి జాగ్రత్తగా తీసి చూసుకుని, గర్వంగా నవ్వి, రామారావువైపు తిరిగి, చెయ్యి అడ్డంపెట్టుకుని, కులాసాగా) చూశారా! మనకి ఎంత మంచిముక్కలొచ్చాయో! చచ్చాడు పీనుగు! (సత్రకాయితో) చెప్పరా! తురుపు చెప్పు! (ముక్కలు అతి జాగ్రత్తగా బల్లమీద పెట్టి, అవతల కుర్చీలోకి మారి, సత్రకాయిముక్కలు తీసుకుని, చూసుకుని, ఏడుపు మొహంతో) తురఫా!—అరకు! (అని, యీదురోమనుకుంటూ ముక్క పడేస్తాడు. వెంటనే తన కుర్చీలోకి చక్కా వచ్చి, ముక్కలు తీసుకుని, తెగనవ్వుతూ, రామారావుతో) అరకుట!— ఇహిహీ!— అక్కడ సరుకేం లేదు! (అని బల్లమీద ముక్క చూసి) అరకు ఆరా! ఛెస్! అయితే మనకి శ్రమ ఎందుకండీ? ఏడడేసి పట్టట్టుగుందాం. నిక్షేపంలాంటి అరకు ఆసు ఉంది. అడాడుకోరూ, ముందర!— వీడికి ఆశేమిటి? (పట్టుతీస్తుగుని, మళ్ళీ ముక్క వేస్తూ) ఇస్పేటుపది! (రామారావుతో) ఏంచేస్తాడో, చూడాలి! (మళ్ళీ అవతల వేపుకి వెళ్ళి, నీరసంగా ముక్కలట్టుకుని,

ఏడుపు మొహంతో చూసుకుని, ఓ ముక్క పడేసి, మళ్ళీ తనవేపుకి చక్కా వస్తూను) హూరి, తొమ్మి దేశాడు, వెఱ్ఱిపీనుగు!-రాజెక్కి పట్టుట్టుకోలే! (అని ఉత్సాహంతో పట్టుకేసుకుంటూ) ఇంక పీడిపని ఓంభాయే!- ఇంతేరా, నీ ఆట?- మొహమేమిటీ, అల్లా పొగ పొగమారి పోయిందేం? (రామారావుతో) మాట పడిపోయింది. మనిషికి!- ఇంక కాస్కో. కళావరు ఆసు! (అంటూ నాజుగ్గా ఓముక్క వేసి, నవ్వాపుకుంటూ) ఏం?-ఇంక బాజాలు పిలవకున్నావా?- (వెంటనే లేచి, అవతల కుర్చీలోకి మారి, తన కుర్చీ!కేసి కసిగా చూసి. తలపంకించి, ఓముక్క తీసి విసురుగా కొట్టి. గర్వంగా నవ్వి) ఇప్పుడేమంటావు?- బాజాలు పిలుస్తాట్ట!- డోలల్లా మొహం పీడూను!- (తిరిగితనకుర్చీలోకి వచ్చి, ముక్కల కేసి ఆశ్చర్యంగా చూసి) ఏరా?- కళావరు లేదూ, నీ దగ్గర?- ఆయి!-అబద్ధమాడితే బుర్రబద్దలు కొట్టేస్తాను సుమా? (కోపంతో, ఒగరుస్తూ) సరే!- (రామారావుతో)- జ్ఞాపకం ఉంచుకోండి!- కళావరు ఆసుమీంద కోశాడు!- కళాయి మొహం, పీడూను! ఆడరా, ఆడు! (అని, అవతల వేపుకి వెళ్ళి, ఠీవిగా నవ్వుతూ పట్టుకేసుకుని. మరోముక్క వేసి, తన వైపుకి వచ్చి, చచ్చిచెడి ఏడుపు ఆపుకుంటూ,

ముక్క పడేసి, తిరిగి అవతలవైపుకి వెళ్ళి నస్యపట్టు తీసుకుని, నక్కలా చూస్తూ ముక్క పడేసి తన వైపుకి వచ్చి, బల్లమీద ముక్క చూసుకుని, కోపంతో బిగుసుకుపోయి, జేవురించిన మొహంతో) ఏమిట్రా, ఇది ?— కళావరు, జాకీయా ?— చూశా రండి ! ఇందాకా నాకళావరు ఆసుమీద కోసేసి, ఇప్పుడు మళ్ళీ కళావరు ఆడుతున్నాడు !—ఇదిట్రా నీ నీ ఆట?— (గట్టిగా అరుస్తూ)దొంగాటలాడతావురా నా దగ్గర ? దగుల్బాజీరాస్కెల్ ! (మనిషి రామా రావు కేసి తిరిగి, చేతుల్తో వెనక్కి చూపిస్తూ)— ఎంతమోసం !— ఎంతద్రోహం!— ఒరేయి తన్ని పాతేస్తాను, తెలుసా ?—మళ్ళా ఇవతలికిలాగి, డొక్క చీరేస్తాను. (ఈ కేకలకి R. F. లోంచి చెవలయ్య L. F. లోంచి ధనరాజూ, M B. లోంచి శాంతా కంగారుగా వచ్చి, తెల్లబోయి నిలబడిపోతారు)

ధన : (అనుమానంగా, మెల్లిగా, జంకుతూ) తప్పురా, ప్రసాదం ?

ప్రసా : (కోపంతో వొళ్ళుమర్చిపోయి) ఛీ, నోర్మూయ్ !— (అని ధనరాజుని చూసి, కంగారుపడి నీరసంగా నవ్వుతాడు,)

ధన : ఖర్మ, ఆ కేకలేమిట్రా ?

ప్రసా : చూడు, బావా!- ఇందాకా నా కళావరు ఆసు మీద కోసేసి, మళ్ళీ ఇప్పుడు కళావరు ఆడు తున్నాడు !

ధన : ఎవర్రా ?

ప్రసా : నా సత్రకాయి!-

ధన : (ఆశ్చర్యంగా, కోపంగా) ఆ!- నీతలకాయి! నీ పేకాట మండిపోనూ! ఎంత భయపెట్టావురా! కొట్టుగు ఛస్తున్నారేమోనని హడిలిచచ్చాను-ఎన్ని సార్లు చెప్పాన్రా, ఈ సత్రకాయి పేకాట నా కొంపలో ఆడద్దని? (గుండెలు రాసుగుంటూ పడక కుర్చీలో జేరి) చెవలయ్యా?- ఆ పేక ముక్కల్ని పోగుచేసి పొయ్యిలో పెట్టు! ఖర్మ! అసలే గుండె జబ్బులో నే ఛస్తూంటే, గుండెలమీద కుంపటల్లా వీడుపోగయ్యాడు. ఉష్ !-హామ్మా! (అని బాధగా కుర్చీలో జేర్లబడి పడుకుంటాడు.)

[శాంత M.B. లోకి తొందరగా వెడుతుంది చెవలయ్య పేకముక్కలు తీస్తూ ప్రసాదంకేసి చూస్తాడు. ప్రసాదం 'తగలెయ్యకు!- దాచు!' అన్నట్లు సౌంజ్ఞచేస్తాడు చెవలయ్య రహస్యంగా తలఊపి, నాలిక ఆడించి పేక ముక్కలుచ్చుగుని R. F. లోకి వెడతాడు. M. B. లోంచి, శాంత మందుసీసా, గ్లాసూ పుచ్చుగుని వస్తుంది]

శాంత : మందు తీసుగో, నాన్నా!

రామా: ఇల్లాం ఇవ్వండి! (అని శాంత దగ్గరున్నంది సీసా, గ్లాసూ పుచ్చుకుని, మందుగ్లాసులో పోసి, ధనరాజుకి అందిస్తాడు.)

ధన : అక్కర్లేదండి. తగ్గింది!

రామా: అయినా సరే, పుచ్చుకోవడం మంచిది. తీసుకోండి, ధనరాజుగారూ!

ధన : (మందుతాగి, మెల్లిగా పడకకుర్చీలో కూచుంటాడు) హమ్మయ్య!

రామా: ఇప్పుడెల్లా ఉందండి?

ధన : బాగా తగ్గిందండి!–అన్నట్లు, చింతయ్య–వచ్చాడా?

[మందుగ్లాసూ, సీసా ఇచ్చెయ్యడం నెపంతో, రామారావు, ధనరాజు కుర్చీ వెనకాల నుంచున్న శాంతదగ్గర తన్మయత్వంతో నిలబడిపోతాడు.]

ప్రసా : (బాధగా, చిటికేసి) ఏమండీ!– బావపిలుస్తున్నాడండీ!

రామా:–(కంగారుగా నవ్వి) అదా?– మరేనండి, ఇంకా రా లేదండి.

ప్రసా : ములక్కాడలు దొరికాయో లేదో!

ధన : (విసుగ్గా) నువ్వూరుకోరా, గొడవ! (ప్రసాదం కోపంగా లేచి R. F. లోకి వెడతాడు.)

రామా: ఈ చింతయ్య ఎప్పుడు వస్తాడో ఏమిటో!–నా కవ తల బోల్డుపనుంది, వెళ్ళిపోవాలి,

ధన : ఉండండి, మరీ! డబ్బు రావడంతోటే మిమ్మల్ని పంపించేస్తాను, సరేనా?

రామా: ఏం రావడమో ఏమిటో!- ఎన్ని గంటలు కూచోనండి, ఇల్లాగ?

ధన : ఇంకెంత సేపండి?—చింతయ్య ఈపాటికి వచ్చేస్తాం టాడుగా? అసలు వచ్చాడేమో కూడాను. ఖర్మ, పోనీ భోగారావు ఇంటికెళ్ళి చూసిరానా?

రామా: చూసిరండి. కాని, పెంద్రాళే రావాలిసుమా? నాకు ముళ్ళమీద కూచున్నట్టుంది.

ధన : నిమిషాలమీద రానూ? నాకు బ్రహ్మ చెముడు డొంకలో దూరినట్టుంది! (అని లేచి కండువా లేసు కుని, చెప్పులు తొడుక్కుని L F. కేసి బయల్దేర తాడు.)

ప్రసా : (R. F. లోంచి వస్తూ) ఎక్కడికి, బావా, వెడు తున్నావు?

ధన : (ఆగిపోయి, బాధగా మూలిగి) ఖర్మ! (వెనక్కి తిరిగి) అడిగావు? శకునపక్షి! (విసురుగా చెప్పులు వదిలేసి, కుర్చీలో కూర్చుంటూ) సమయానికి లుడుంగుని చక్కావస్తాడు. గాడుగేదెల్లా మొహం నీడూను!

ప్రసా : (చిన్నబుచ్చుకుని) అడిగితే అంత కోపం ఎందుకూ?
(చిరునవ్వుతో) బజార్లో కెడుతున్నావా?

ధన : కాదు, ఏట్లోకి!

ప్రసా : (కంగారుగా) అయ్యో, ఎందుకూ ?

ధన : (మతోయినట్టు చూస్తూ) ఒరేయి, నువ్వు లోపలికి
ఫో, ముందు!

ప్రసా : నేను పోను! ఇక్కడే కూచుంటాను. (అని కుర్చీలో
కూర్చుంటాడు.)

ధన : కూచో! అంతకంటే ఉద్ధరిస్తాననుకున్నా నా ?

రామా: (విసుగ్గా చొక్కా దులుపుకుంటూ) అబ్బబ్బ! గాలే
లేదండి, ఈ కొంపలోనూ!

ధన : పోనీ విసినికర్ర తెమ్మన్నా!

రామా: చమట పట్టేసి. వొళ్ళంతా చిరాగ్గా ఉంది. ముందు
స్నానం చేస్తాను. చెవలయ్యతో. చెప్పండి!

ప్రసా : సాయంకాలం స్నానం ఏమిటీ? ఛ లెయ్యదూ?

రామా: అదే! వేన్నీళ్ళు పెట్టమని చెప్పండి.

ధన : (ప్రసాదాన్ని తినేలాచూసి, రామారావుతో)ఖర్మ,
అల్లాగేనండి. చెవలయ్యా!

చెవ : (R. F. లోంచి వస్తూ) బాబయ్యా!

ధన : ఈయన స్నానం చేస్తారట కాసిని వేన్నీళ్ళు పెట్టు!

చెవ : నిన్ననే చెప్పానుకదండీ, పుడకలయిపోనాయనీ ?

ధన : ఎల్లారా, ఇప్పుడుమరి? పోనీ ఆ పాతపందిరిమీంచి నాలుగు తాటాకులుతీసి తగలెయి!

ప్రసా : (హుషారుగా) మరోనాలుగు తియ్యి! నేనూపోసుగుంటాను!

ధన : (కోపంగా) అసలాపందిరి పీకి పొయ్యిలో పెట్టరా, తీరిపోతుంది!

చెవ : (కంగారుగా) సిత్తం! (R. F. కేసి నడుస్తాడు.)

ధన : (హడిలిపోయి) ఒరేయి! నిజంగా పందిరి పీకేస్తా వేమిట్రా, ఖర్మ? ఇల్లారా! పక్కింటి సుబ్బయ్య దగ్గరకెళ్ళి, చుట్టాలొచ్చారు, అని చెప్పి నాలుగు పుడకలు పట్రా! ఆ?

చెవ : సిత్తం! (R. F. లోకి వెడతాడు.)

ధన : ఒరేయి, ప్రసాదం! మళ్ళీ ఎక్కడకని అడక్కు! అక్కడే కూర్చో, ఇప్పుడే వస్తాను! ఆ? (ప్రసాదం తల ఊపుతాడు.)

ప్రసా : అల్లాగే, బావా!

ధన : (రామారావుతో) వెళ్ళొస్తానుమరి! మీరిక్కడే కూచుంటారుకదూ? బయట మాగిలకయ్య ఉంటాడులెండి!

రామా: ఉండనియ్యండి. ఎవ్వరూ కాపలా లేకపోయినా ఇక్కడే కూచుంటాను.

ధన : (కొంటెగా నవ్వుతూ) అహాఁ! మీ పెద్దమనిషితరహా నాకు తెలియదూ? వస్తా!

[ధనరాజు L.F. లోకి వెడతాడు. ప్రసాదం కుర్చీలో కూచుంటాడు. రామారావు పచార్లు చేస్తూంటాడు. శాంత M.B. లోంచి, చిన్న బిందె చేత్తో పుచ్చుగుని వచ్చి R.F. లోకి వెడుతూ, రామారావుకేసి ఓరగా చూసి నవ్వి చక్కాపోతుంది. రామారావు ఉత్సాహంగా చూసి పరాగ్గా కూచున్న ప్రసాదందగ్గిరికి వెడతాడు.]

రామా: ప్రసాదం? నువ్వు మేడమీదకి వెళ్ళి మరో నాలుగు వారపత్రికలు తీసుకురా! అవేనా చదువుకుంటాను.

ప్రసా : (అల్లానే కూచుని) ఇంకెక్కడ ఉన్నాయండీ? ఉన్నవివే? ఇవేనా, పక్కింటిలోంచి తెచ్చింది, శాంత! కొంటే మాబావ చెట్టెక్కి ఉరోసుగోడూ?

రామా: (R. F. కేసి ఆదుర్దాగా చూసి) ఇవన్నీ చదివేశానోయి! ఎంతోచడం లేదు! అయినా ఓసారి మేడెక్కి చూడకూడదూ? ఏమైనా ఉన్నాయేమో!

ప్రసా : ఉంటే ఎంతసేపూ? చిటికలో తెస్తాను. (అని వెడతాడు.)

రామా: తొందరలేదు? తాపీగా పట్రా!

[ప్రసాదం బుర్ర ఊపి మేడమీదకి వెళ్ళిపోతాడు. రామారావు జాగ్రత్తగా ఇటూఅటూ పరకాయించి, ఉత్సాహంగా R.F. కేసి వెళ్ళేసరికి, R.F. లోంచి చెవలయ్య వచ్చి అనుమానంగా చూస్తూ నుంచుంటాడు. రామారావు నిట్టూర్చి నవ్వు తెచ్చిపెట్టుగుంటాడు.]

చెవ : ఏటి బాబయ్యా!

రామా: వచ్చావా? రా! -నీకు నెయ్యేళ్ళాయుపు! ఇప్పుడే నీ గురించి అనుకుంటున్నాను-నీళ్ళు కాగాయా?

చెవ : సెయ్యేడితే ఇంకా సుగ్రమంటం లేదండి.

రామా: బాగానేఉంది. త్వరగా కాచవోయి. మరీ?

చెవ : సిత్తం! (R. F. లోకి వెళ్ళిపోతాడు.)

[రామారావు ఒక్కక్షణం ఆగి ఉత్సాహంతో చిటికేసి R. F. లోకి వెడతాడు. అతడు వెళ్ళిన క్షణానికి శాంత చిరునవ్వుతో M. B. లోంచి. నాలుగు వారపత్రికలు చేత్తోపట్టుగునివచ్చి, బల్లమీద పెట్టి తొందరగా M. B. లోకి వెళ్ళిపోతూంటే R.F. లోంచి రామారావు నిరుత్సాహంగా వచ్చి, శాంతని చూసి ఉత్సాహంతో 'శాంతా!- అని పిలిచి, M. B. కేసి వెడతాడు, ఇంతలో మేడమెట్లమీంచి ప్రసాదం ధడధడా చక్కావస్తాడు.]

ప్రసా : (విసుగ్గా) ఏమిటీ దారుణం?

రామా: (కంగారుపడి) ఏమిటది?

ప్రసా : అదే! మేడంతా వెతికాను, ఒక్క పుస్తకమేనా దొరకలేదు!

రామా: అదా!- చంపావ్?- పోన్లే!- అన్నట్లు నిన్ను చెవలయ్య పిలుస్తున్నాడు!

ప్రసా : (తాపీగా కుర్చీలో కూచుంటూ) ఆ, వాడికేం పన్లేదు!

రామా: (గబగబా ఆలోచించి) నీపేక ముక్కలు పొయిలో పెడతానంటున్నాడు.

ప్రసా : (అధిరిపడి లేచి) వద్దని చెప్పాగా?- వస్తానుండండి!

[అని కంగారుగా R.F. లోకి పరిగెడతాడు. రామారావు హాయిగా నిట్టూర్చి, ఆనందంతో M. B. వేపు తిరుగుతాడు అగుమ్మందాకా వెళ్ళే సరికి, L. F. లోంచి ప్రెసిడెంటు ఠీవిగా వస్తాడు.]

ప్రెసి : ధనరాజుగారున్నారండీ ?

రామా: (విసిగెత్తిపోయి, బాధగా వెనక్కి తిరిగి) ఎవరది ?

ప్రెసి : (రామారావుని ఎగాదిగా చూసి) మీరెవరూ?

రామా: మీరెవరూ ?

ప్రెసి : అహా !– వాటం జోరుగా ఉందే ?

రామా: ఏం ?–మాటలు జోరుగా ఉన్నాయేం ?

ప్రెసి : అయ్యో, ఉన్నారా అంటే అంత కోపం ఎందుకయ్యా?

రామా: ఎవరు ?

ప్రెసి : ధనరాజుగారు.

రామా: లేరు !

ప్రెసి : ఎక్కడికెళ్ళారు ?

రామా: తెలీదు !

ప్రెసి : ఎప్పుడొస్తారు ?

రామా: తెలీదు !

ప్రెసి : (ఒక్కక్షణం ఆలోచించి, కొద్దిగా నవ్వి) పోన్లెండి! (అని వెనక్కి తిరిగి పక్కనున్న కుర్చీలో కూచుంటాడు. రామారావు కోపంగా మరో కుర్చీలో కూలబడతాడు) [illegible]

రామా: కాదు!

ప్రెసి : స్నేహితులా ?

రామా: కాదు.

ప్రెసి : (మంచిగా) ఒహో!– ఏదోపనిమీద వచ్చుంటారు.

రామా: లేదు, నడిచేవచ్చాను!

ప్రెసి : (చిరికోపంతో) అహా!– ఈకాలం కుర్రాళ్ళు మాట్లాడ్డం మాత్రం బాగా నేర్చారు!

రామా: మరే!– ఈకాలం పెద్దాళ్ళు తినడంమాత్రం మహా బాగా నేర్చారు!

ప్రెసి : (కోపంగా లేచి) చాల్చాలు, ఊరుకోవయ్యా!–పెద్దా చిన్నా లేకుండానూ! ఎవరితో మాట్లాడుతున్నావో, తెలుసా ?

రామా: (లేచి, అమాయకంగా) తెలియదండీ!

ప్రెసి : నే నీవూరు ప్రెసిడెంటుని!–

రామా: (జాలిగా) పాపం!–

ప్రెసి : పాప మేమిటి ?

రామా: ఈవూరుమీద జాలేస్తోంది!

ప్రెసి : ఏమిటోగోడవ– అసలు మీరు ఈవూరు ఏంపని మీద వచ్చారు ?

రామా: ఏం ?– ఇది మీరాజ్యమా ?

ప్రెసి : రాజ్య మేమిటయ్యా ? ప్రెసిడెంటుని గనక అడుగు తున్నాను.

రామా: మీరు ప్రెసిడెంటంటే. ఊళ్ళో ప్రజలకి పెద్దనాఖ రన్నమాట !— ఏమిటీ మహారాజులా కబుర్లు చెబుతున్నారు ?— నాఇష్టమొచ్చిన పనిమీద వచ్చాను. మీ కేం ?— మీపని మీరు చూసుగోండి !

ప్రెసి : అల్లానే, అల్లానే !— (అని మీసాలు వాడిగా దువ్వుకుని, చుట్ట అంటించుగుని) చెవలయ్యా !— చెవలయ్యా!

ప్రసా : (పేకముక్కలు కలుపుగుంటూ R. F లోంచి వచ్చి) ఎవరూ ?— ప్రెసిడెంటుగారా ?— దణ్ణమండి !

ప్రెసి . ఓ !— నువ్వున్నావా ?— మీబావేడోయి ?

ప్రసా : ఇంట్లో లేడండి !

ప్రెసి : సరే !— ఎక్కడికి కెళ్ళాడు ?

ప్రసా : (L F. కేసి చూపిస్తూ) వీధులో కెళ్ళాడు.

ప్రెసి : వీధులో కే, ఎక్కడికి కెళ్ళాడు ?

ప్రసా : వీధులో రోడ్డుమీదకండి.

ప్రెసి : (విసుగ్గా) ఎందు కెళ్ళాడు ?

ప్రసా : (పిరికిగాచూస్తూ) వీధులో కెళ్ళడానికి !—

ప్రెసి : (నిరాశతో నిట్టూర్చి) హుష్ !— నీతో మాట్టాడితే తల నొప్పికూడా వస్తోంది. చెవలయ్యానోసారి కేకెయి !

ప్రసా : చిత్తం !— అమృతాంజనమేనాండి ?

ప్రెసి : కాదు— చెవలయ్య !

ప్రసా : ఆదేనండి, అమృతాంజనం !

ప్రెసి : (తలపట్టుగుని) ప్రసాదం !- ఇంక నువ్వు మాట్టా డకు. అల్లాకూరోచ్చి !- (ప్రసాదం బెదిరిపోయినట్టు కూచుంటాడు) చెవలయ్యా !- చెవలయ్యా !

ప్రసా : ప్రెసిడెంటుగా రొచ్చార్రా?

చెవ : (చెవలయ్యR. F. లోంచివచ్చి) దణ్ణం మారాజా !

ప్రెసి : ఏం, చెవలయ్యా !-ఈ ఏడు మీ అయ్యగారు తన పాలికబస్తాల మామూలు పంపించడేమిటి ?

చెవ : అదేంటి, బాబయ్యా, అల్లాగంటారూ ?

ప్రెసి : మరెల్లా అనమంటావ్?—పంటలు ఇంటికి జేరి మూణ్ణెల్లయింది. ఇప్పడికి ముప్ఫయి కబుర్లెట్టించినా మాటేనా రాలేదు. అసలా సంగతేమిటో కను క్కుందామనే వచ్చాను.

చెవ : తమరు కూడా ఆగ్రహిత్తే ఎలా సెప్పండి? ఈయేడు వరదలొచ్చి పంట శానా పోయిందండి.

ప్రెసి : ధనరాజుకి తగ్గ నౌఖరులాగున్నావే నువ్వు ? వరద మీకొక్కళ్ళకే వచ్చిందా? లఖాధికార్లు కూడా ఇల్లా చేతులు నలుపుతూంటే మాబోటివాళ్ళింక మట్టికొట్టుగు పోవలిసిందే !

ప్రసా : మంచి మాటన్నారు !

ప్రెసి : (కోపంగా) ఏమిటూ మంచి ?

ప్రసా : (బిగుసుకుపోయి) ఏం లేదు !

చెవ : ఆ రెద్దో తెలియక అంటూంటూంటారండి, తమ రొచ్చినారని అయ్యగార్తో సెప్తా న్లండి.

ప్రెసి : చెప్పు! మామూలు మర్యాదగా ఇచ్చెయ్యమన్నా నని చెప్పు! ఇంక వేషాలేమన్నా వేస్తే C. T. O ని పిలిపించి వ్యాపారమంతా రోడ్డు మీటికి లాగుతా నన్నానని కూడా చెప్పు!

చెవ : అంత మాటనకండి, బాబయ్యా! – ఇయ్యాలో రేపో తప్పకుండా పంపించేత్తారు.

ప్రెసి : ఈ వాయిదాలు చాలా అయ్యాయి!–అసలు ధనరా జెపుడొస్తాడు?

చెవ : యిప్పుడొచ్చేత్తారండి?

ప్రెసి : (కూచుని) సరే!– నువ్వెళ్లారా!– సుబ్బయ్య కొట్టు మీదికి వెళ్ళి నే నిమ్మన్నానని ఓ కట్ట లంకాకు చుట్టలట్రా?

చెవ : సిత్తం! (అని తొందరగా L. F లోకి వెళ్ళిపో తాడు.)

ప్రెసి : (కాలాడిస్తూ, ఠీవిగా) ఊ!– ప్రసాదం!

ప్రసా : ఏమండీ?

ప్రెసి : (రామారావుకేసి నిర్లక్ష్యంగా చూపిస్తూ) ఈయన్ది ఈవూరేనా?

ప్రసా : కాదండి! వీరు మా బావ స్నేహితులు. మా ఇంటికి చూడ్డాని కొచ్చారు, అని మా బావ చెప్పాడు!

ప్రెసి : అదా సంగతి?– ఉద్యోగం ఏమన్నా ఉందా?

ప్రసా : లే లేకేమండీ?– పట్నంలో పెద్ద ఉద్యోగం!

రామా: (ఊకుకోమన్నట్టు) ప్రసాదం!
ప్రసా : ఆ !–ఆదేమిటి ?. కలెక్టరు !!
ప్రెసి : ఏమిటీ ?– (బిక్క మొహంతో) కలెక్టరే!
ప్రసా : మరే మరే!
ప్రెసి : (చచ్చి చెడి గుటకేసి, బెదురుతూ) దణ్ణాలండి !– (రామారావు విసుగ్గా చూసి, లేచి, సిగరెట్టు ముట్టిస్తాడు.) ప్రతిఏడూ ధనరాజు దగ్గిర పాతిక బస్తాలూ మామూలుగా కొంటూంటూనండి. డబ్బు ఎప్పటి కప్పుడే ఇచ్చేస్తూంటూనండి !
రామా: నాకేమీ చెప్పక్కర్లేదు, వెళ్ళండి !
ప్రెసి : చిత్తం !– దేవుడు దయచేసినట్టు తెలియ లేదండి. బళ్ళో మీకింగెట్టించమంటూరా ?
రామా: (కోపంతో నిట్టూర్చి, ప్రసాదంతో) గుట్టుగా నేకూర్చుంటే నువ్వేగొడవ తెచ్చిపెట్టా వేమిటోయి, ప్రసాదం ?
ప్రెసి : చిత్తం !– ప్రమాణంగా ఎవరితోనూ చెప్పనండి !
ప్రసా : జాగ్రత్తసుమండి !– చాలారహస్యం పనిమీద వచ్చారు. ఇంకా రెండు మూడురోజు లుంటారు !
ప్రెసి : (దడతో) చిత్తం ! చిత్తం !– ఊళ్ళోపన్లున్నాయి, నమస్కారాలండి! (L F. వైపు వెనక్కి నడుస్తాడు.)
ప్రసా : ప్రెసిడెంటుగారూ !– చుట్టలో ?–
ప్రెసి : (రామారావు చూడకుండా తల కొట్టుకొని) మీ బావకేయ్యి!– డబ్బులు నే నిచ్చేశానని చెప్పు!–

నమస్కారమండి ! (L. F. లోకి కంగారుగా వెళ్ళి పోతాడు.)

రామా: (ప్రసాదంతో పాటు నవ్వుతూ) మాంఛ లేవాడివే నువ్వు !– (L. F. కేసి నడుస్తూ) వదిలింది శని ! (రామారావు L. F. దాకా వెళ్ళి వెనక్కి తిరిగే లోగా శాంత M. B. లోంచి వచ్చి చిరునవ్వుతో R. F. లోకి వెళ్ళిపోతుంది. ప్రసాదం ఆనందంతో శాంత వెనక్కాలే బయల్దేరతాడు.) అసలూ !– ప్రసాదం ! అల్లా పోతున్నా వెక్కడికి ?

ప్రసా : ఇదుగో, వస్తున్నా !– (రామారావు దగ్గరకొచ్చి సిగ్గుపడుతూ చిరునవ్వుతో) రామారావుగారూ !– మనిద్దరం మంచి స్నేహితులం, అవునా ?

రామా: తప్పకుండాను !

ప్రసా : అయితే, నే నొకటడుగుతాను. నవ్వకుండా చెబుతారా ?

రామా: అడుగు, ప్రసాదం !

ప్రసా : (ఆలోచించి, సిగ్గుపడుతూ) మరే !–నాకు ఓ అమ్మాయంటే చాలాఇష్టం !–

రామా: (ఆశ్చర్యంగా నవ్వి) ఆ !– ఎవరా అమ్మాయి ?

ప్రసా : ఎవరైతే మీకెందుకూ ?– వినండి !– ఎంత ఇష్టమో చెప్పలేను. ఆ అమ్మాయి మాటంటే వేదంలా విని పిస్తుంది. నవ్వితే నాకింకేమీ అక్కర్లేదు. నాకు

ఇంత ఇష్టముందని ఆ అమ్మాయికి తెలీదు. ఆ అమ్మాయికి ఎంత ఇష్టముందో నాకు తెలియదు...మరి, నే నిప్పుడు ఏంచెయ్యాలి ?

రామా: మాంగట్టిప్రశ్న అడిగావు. మొత్తానికి అసాధ్యుడవే!- ఊఁ!- ఇంకేం ? ప్రేమ విసరవయ్యా!

ప్రసా : ఇదేమన్నా పీటచెక్కా-, కంకర్రాయీ అనుకున్నా రేమిటండీ, విసిరెయ్యడానికీ ?- అసలాసరుకే దొరకటంలేదు, నాకు.

రామా: ప్చ్!- అంటే, ఏవో రెండుమూడు తియ్యటి మాటలు చెప్పాలి.

ప్రసా : ఓ ! అల్లాఅన్నారు బావుంది. రెండుమూడేంఖర్మ!- అరడజను దాకా సిద్ధంచేసి పెట్టాను. రుచి చూపించనా ?

రామా: ఊఁ!- రానీ !-

ప్రసా : మరి, మీరే శాంతలాగ !- (అని నాలిక కరుచుకుని, వెనక్కి తిరుగుతాడు.)

రామా: (ఆశ్చర్యంగా) ఒహో !- మీ బావమూతురా ?- దేవాంతకుడివయ్యా నువ్వు!...

ప్రసా : నోరు జారిపోయింది!- మరెక్కడా అనకండి. నన్ను చంపుకు తిన్నంత ఒట్టు!

రామా: అబ్బ! అంత ఘాటయిన వట్టెందుకయ్యా ?- అనను లే !

ప్రసా : సరే !- అయితే మీరా శాంతలాగ నిలబడండి !- నవ్వకండి, మరి !- చెప్పేయ్యనా ?

రామా: చెప్పు !-

ప్రసా : (వెనక్కి-వెళ్ళి ఆలోచించుకుని, ధైర్యంగా సమీపించి, చెప్పబోయి సిగ్గుపడిపోయి తలవంచుకుని) శాంతా !- నీకు మావూరంటే ఇష్టమేనా?-మావూరొచ్చేయి, శాంతా !- (నాలిక తడుపుకుని, జ్వర మొచ్చినట్టు చూస్తూ) శాంతా !- మావూళ్ళోనే మంచి చెరువుంది- అందులో ఒక్క- జలగేనా లేదు. మాఇంట్లోనే ఆరు కొబ్బరిచెట్లున్నాయి !- మూడు గేదెలున్నాయి !- ఏమంటావు ?

రామా: (నవ్వి) అబ్బెబ్బే !- ఇల్లా గేదెలూ, కొబ్బరిచెట్లూ అంటే లాభంలేదు.

ప్రసా : ఆ ! మరేమనాలి ?

రామా: (ఆలోచించి, చిటికేసి) ఓపనిచెయ్యి ! ఈసారి ఆ అమ్మాయిని కలుసుకున్నప్పుడు, ఎవ్వరూ లేకుండా చూసి నే చెప్పే పాఠం అప్పచెప్పేయి !- మళ్ళీ ఆ అమ్మాయి ఏమందో నాతో చెప్పు !

ప్రసా : మళ్ళీ మీతో ఎందుకూ ?

రామా: (సద్దుకుని) ఆ !- పరిస్థితి ఎల్లాఉందో చూద్దాం !

ప్రసా : సరే చెప్పండి !

రామా: అక్షరం అక్షరం జాగ్రత్తగావిను! (అభినయిస్తూ) శాంతా!– ఆ ఉత్సవాల్లో నిన్ను కలుసుకున్నప్పటి నుంచీ!–

ప్రసా: (అడ్డమొచ్చి) నేను ఉత్సవాల కెళ్ళాందే?

రామా: అబ్బ! అడ్డదిడ్డం ప్రశ్న లెయ్యక, చెప్పింది, చెప్ప వయ్యా! లేకపోతే, నీ ఇష్టం.

ప్రసా: అబ్బే, ఊరికే అన్నానండి. చెప్పండి. (అని రామా రావుకి ఎదరముందుకి తిరిగి సిద్ధంగా నుంచుంటాడు.)

రామా: (అభినయిస్తూ) శాంతా!

ప్రసా: (అనుకరిస్తూ) శాంతా!

రామా: (కొంచెం బిగ్గరగా) శాంతా!

ప్రసా: (అనుకరిస్తూ) శాంతా!

రామా: (అనురాగంతో. మెల్లిగా) శాంతా!

ప్రసా: (అనుకరిస్తూ) శాంతా!

రామా: (అభినయిస్తూ) ఆ ఉత్సవాల్లో నిన్ను కలుసుకున్న ప్పణ్ణించి నా జీవితమే మారిపోయింది! నిన్ను మనసారా ప్రేమించాను. అసలు, ఈ పన్నాగ మంతా నిన్ను చేరడానికే! అనుగ్రహిస్తే పెళ్ళి చేసుకుని నిన్ను నా హృదయకుసుమాలతో ఆరా ధిస్తాను. నీ సమాధానంమీద నా బ్రతుకంతా ఆధారపడివుంది!–ఏమంటావు, శాంతా?

ప్రసా : (శాంతిలా సిగ్గుతో నవ్వుతూ) 'మీఁఇష్టం!' అని తీరుతుంది, శాంత! మాటల్లో ఎంత మంత్రంవుంది! ఈ సరుకెక్కడ సంపాదించారు ?

రామా: దానికేంగాని, పాఠం జ్ఞాపకం ఉందా ?

ప్రసా : వింటే వొదుల్తాటండీ?– అక్షరం అక్షరం మేకెట్టి కొట్టేశాను. ఇంక కనపడ్డమే తరువాయి !

చెవ : (L. F. లోంచి తొందరగా వచ్చి) ప్రెసిడెంటుగా రేరీ ?

ప్రసా : ఈపాటికి ఇంటిదగ్గిర చెంబుడు నీళ్ళు తాగుతూం టాడు. చుట్టలు మాబావ కిమ్మన్నాడు — ఇల్లా ఇయ్యి !

చెవ : నిజమేనాండీ? ఎందుకెళ్ళిపోయారో ఏటో! ఆ బాబుకి ఆగ్రహమొత్తే నాకు మతుండదు !

ప్రసా : అసలా బాబుకే మతిలేదు. (అని చుట్టలుచ్చుగుని) ఇదంతా కలెక్టరుగారి చలవే !

చెవ : ఏ కలెక్టరుగారండీ?

రామా: ఆ గొడవకేంగాని, నీళ్ళు ఇప్పటికేనాకాగాయో లేదో చూడు !

చెవ : ఈపాటికి మరుగుతూంటాయండి. రండి, పోసుకుం దురుగాని !

రామా: మరి నాదగ్గర తువ్వాలూ. గుట్టాలేదు.

చెవ : తువ్వాలూ నే నిత్తారండి !

ప్రసా : నన్ను గట్రట ఇమ్మంటారా ?

రామా: (చిరునవ్వుతో) అక్కర్లేదుగాని, పాఠం మాత్రం మర్చిపోకు !

ప్రసా : ఓ !– మేకులు !– మేకులు !...మీరెళ్ళండి !

చెవ : (ఆశ్చర్యంగా నవ్వుతూ) ఒకప్పుడు, ఈ బాబు ఓరికీ అర్థం కాకుండా మాట్లాడుతుంటాడు.

ప్రసా : దాన్నే వేదాంతమంటారోయి, సీతాపతి !–త్వరగా వెళ్ళండి.

[రామారావు, చెవలయ్య, నవ్వుకుంటూ R. F. లోకి వెడతారు. ప్రసాదం ఒక్కడూ రామారావు చెప్పిన పాఠం రిహార్సల్సు వేసుకుంటూంటాడు. శాంత చిరునవ్వుతో R.F. లోంచి వచ్చి ప్రసాదం వెనక్కాల నుంచుంటుంది. ప్రసాదం L. F. కేసి తిరిగి రిహార్సల్సు ధోరణిలో నాజూగ్గా, ప్రేమతో మెల్లిగా 'శాంతా !–' అంటాడు. శాంత కొద్దిగా నవ్వుకుని, మావా !– అంటుంది. ప్రసాదం ఆ తన్మయత్వంలో 'శాంతా !–' అంటూ L. F. కేసి గబగబానడిచి, ఆగి హడిలిపోయి వెనక్కి తిరిగి శాంతిని చూసి కంగారుగా నవ్వుతాడు.]

శాంత : (నవ్వుతూ) ఏం చేస్తున్నావు, మావా ?

ప్రసా : మరే ! (అని సద్దుకుని) ఏం– లేదు !

శాంత : (మళ్ళీ నవ్వి, వెనక్కి తిరిగి వెళ్ళబోయి, కిందచిందర వందరగా ఉన్న పుస్తకాలు చూసి) అయ్యో !– ఇదేమిటి ?

ప్రసా : పుస్తకాలు !

శాంత : (పుస్తకాలు తీస్తూ) అది సరే !– పుస్తకాలన్నీ ఇల్లాగేనా పారేసుగోడం ? అందులో మనవి కాదు కూడాను !

ప్రసా : పారేయ్యడమేమిటి ?_ఆయన చదువుతున్నారు!

శాంత : (పుస్తకాలు మేజామీద పెట్టి) మంచి చదువే !- పుస్తకా లుచ్చుగుని దిక్కులు చూడ్డం!

ప్రసా : అబ్బే, పుస్తకమే చదువుతూంట!- ఒకవేళ మెల్ల కన్నేమో ?

శాంత : మెల్లకన్నేం ఖర్మ !- మంచికళ్ళే ! (సిగ్గుపడి నవ్వుకుని M B. కేసి నడుస్తుంది.)

ప్రసా : (పాఠం జ్ఞాపకంవచ్చి అదిరిపడి) శాంతా! శాంతా!

శాంత : ఏం, మావా !

ప్రసా : ఇల్లా రా !

శాంత : (వచ్చి) ఊఁ ! ఎందుకూ ?

ప్రసా : నుంచో చెప్తాను, (అని వెనక్కి తిరిగి తొందరగా ఆలోచించుగుని గబగబా చక్కావస్తాడు. వచ్చి సిగ్గుపడుతూ, చిరునవ్వుతో) శాంతా ! ఆ ఉత్సవాల్లో నిన్ను కలుసుగున్నప్పటినుంచీ నా జీవితమే మారిపోయింది!

శాంత : (ఆమాటలు విని, శాంత అదిరిపడి, రెండడుగులు వెనక్కివేసి, తెల్లబోయి) ఉత్సవాలా ? నీకెవరు చెప్పారు ?

ప్రసా : (విసుగ్గా) ఎక్కడో చెప్పించుగున్నాను, నీకెం దుకూ? ముందు పూర్తిగా విని తోచిందేదో ఆ తర్వాత చెప్పు! (మళ్ళీ పాతధోరణిలో) శాంతా !

ఆ ఉత్సవాల్లో నిన్ను కలుసుకున్నప్పట్నుంచీ నా జీవితమే మారిపోయింది! నిన్ను మనసారా ప్రేమించాను! (శాంత అర్థంచేసుకున్నట్టు సిగ్గుపడిపోయి, తల దించుకుంటుంది.) ఈ పన్నాగమంతా నిన్ను చేరడానికే! అనుగ్రహిస్తే నిన్ను పెళ్ళి చేసుకుని హృదయ కుసుమాలతో ఆరాధిస్తాను! నీ సమాధానంమీద నా బతుకంతా ఆధారపడి వుంటుంది! ఏమంటావు, శాంతా? (ఆనందంలో శాంత నిలబడి పోయి ప్రసాదాన్ని చూసి, సిగ్గు ముంచుకురాగా నిలబడలేక నవ్వుతూ M. B. లోకి పరిగెట్టుకు పోతుంది. ప్రసాదం తెల్లబోతాడు) అంటే!–దీనికేం సమాధానం ఉండదా?

రామా: (పెద్దపని ఉన్నవాడిలా R. F. లోంచి గబగబా వస్తూ) తువ్వాలు! తువ్వాలేదీ? (అంటూ ప్రసాదాన్ని చేరి, రహస్యంగా) సమాధానం ఏమిటి? (శాంతా ఎల్లా మారిపోయి M. B. లోకి పరిగెట్టిందో, ప్రసాదం కూడా అల్లాగే M. B. దాకా పరిగెట్టి చూపిస్తాడు.) అదేమిటి?

ప్రసా: ఏమో, నాకేం తెలుసూ? ఇదే వచ్చినసమాధానం (విసుగ్గా) మీమాటల్లో ఏదో మేజిక్కు ఉందనుకున్నాను నేనూ!

రామా: మాటల్లో మేజిక్కు లేకపోవడమేం? చెప్పడంచేత కాగపోతేనేసరి!

ప్రసా : సైగా, ఇవోటూ? మీరారెల్లా చెబితే ఇల్లా చెప్పాను!

రామా: కొన్ని మాటలు మింగేశావేమో!

ప్రసా : (వొళ్ళు మండిపోయినట్టు చూస్తూ) వొక్క వొత్తు కూడా మింగలేదు!

రామా: ఏమైతేం? ఫలితం పాడుచేశావు. తీరిపోయింది!

ప్రసా : అందుకనే నాకు ఒళ్ళు మండుకొస్తుంది. సరుకులేని మాటలట్టుగొచ్చి సరిగా చెప్పలేదనినన్ను డబాయిస్తా రేమిటి? (M.B. వెనక పొంచి, చిరునవ్వుతో వింటున్న శాంతని చూపెట్టి) ఆ మనిషినే మీ ముందు మళ్ళీ నుంచోపెడతాను ఆమాటలే మీరు మళ్ళీ అనండి! ఇంకా ఎంత ఫలితం వస్తుందో నేనూ చూస్తాను. (అని M.B. కేసి నడుస్తాడు. శాంత హడిలిపోయినట్టు చూసి M.B. లోకి మాయమవుతుంది) చెపుతే వినకపోతే ఛస్తామా? శాంతా!— నువ్వెళ్ళిపోతే నన్ను చంపుకు తిన్నట్టే!

శాంత : (M. B. గుమ్మంలోకి వచ్చి) ఏమిటి, మావా! నీకేం మతిపోయిందా?

ప్రసా : మతిపోతే మళ్ళీ అదేవస్తుందిగాని, ముందు మర్యాద పోయేలా ఉంది, ఇల్లారా!

శాంత : నేనురాను! (అని రామారావుకేసి కోపంగా చూస్తుంది. రామారావు నవ్వు ఆపేసి ఏమీ ఎరగనట్టు మరోవేపుకి చూస్తాడు.)

ప్రసా : అయితే నేను నూతులో దూకుతాను!

శాంత : (హడిలిపోయి M. B లోకి వచ్చి) ఏమిటి మావా, ఆ మాటలు ?

ప్రసా : ముందురా, చెప్తాను!

శాంత : (సగం దూరంవచ్చి, L. F. కేసి భయంగా చూసి) ఇప్పుడు నాన్నవచ్చాడంటే నన్ను నిజంగా బతగ నియ్యడు.

ప్రసా : అదా నీభయం! తలుపేసేస్తే రాలేడుగా! వుండు చెపుతాను. (అని తొందరగా L.F. లోకి చక్కా-పోతాడు శాంత పిలుస్తున్నా వినిపించుగోడు.)

శాంత : (రామారావుతో) ఏమిటండీ ఈ సాహసం ?

రామా: క్షమించు, శాంతా! కథ ఇల్లా అడ్డం తిరుగుతుందనుకోలేదు! కాని దైవసాక్షిగా నిన్ను ప్రేమిస్తున్నాను. వివాహం చేసుగుందామనే సదుద్దేశంతోనే నేనిక్కడకి వచ్చాను నాప్రార్థనకి నీ సమాధానం ఏమిటి ?

శాంత : నా మనసూ, మర్యాదా మీచేతుల్లోనే వున్నాయి.

రామా: (ఆనందంతో) రెండూ రెండు కళ్ళల్లా కాపాడుకుంటాను.

శాంత : (L. F. కేసి బెదురుతూ చూసి) మావయ్య వస్తున్నాడు!

రామా: నేను వెడుతున్నాను! (అని తొందరగా R F. లోకి వెళ్ళిపోతాడు )

ప్రసా : (ఉత్సాహంగా L. F. లోంచి వచ్చి, తెల్లబోయి) ఈ సీతాపతి ఏడీ ?

ధన : (వెంటనే L. F. లోంచి వస్తూ) సీతాపతి ఎవడ్రా?

ప్రసా : (వెనక్కి చూడకుండా, యాదాలాభంగా) ఈ సీతాపతి ఎవడు? (వెనక్కి తిరిగి కంగారుపడి, నవ్వి) నువ్వా !-(వెంటనే తెల్లబోయి)-నువ్వే ! !

ధన : ఆ చూపేమిట్రా ?

ప్రసా : ఏం లేదూ !-మరి, నువ్వు లోపలి కెల్లావచ్చావ్ ?

ధన : నీమొహంలా ఉంది. నేను లోపలికి కొచ్చేకేగా నువ్వు తలు పేసొచ్చావు ? అయనేడీ ?

ప్రసా : (నిట్టూర్చి) నీళ్ళోసుగుంటున్నాడు.

ధన : పోసుగుంటున్నాడూ, ఖర్మ ?- అమ్మాయి నువ్విల్లా వచ్చా వెందుకూ ? అనవసరంగా హాల్లో తిరగద్దని ఎన్ని సార్లు చెప్పాను ?-లోపలికెళ్ళు !

ప్రసా : ఆ, ఏం లేదు బావా ! - నువ్వింకా రాలేదని చూడ్డాని కొచ్చింది. 'చీకటి పడిపోయింది. ఆవులూ, గేదెలూ వచ్చేశాయి. నాన్నింకా ఇంటికి రాలేదేం?' అని నన్ను చంపుకు తినేస్తోంది !

ధన : (ప్రేమతో) అల్లానా ?-వంటయిందా, శాంతా ?

శాంత : అవుతోంది, నాన్నా !

ధన : త్వరగా కానీయి, తల్లీ ?-చాలా ఆకలేస్తోంది.

ప్రసా : నుకే !- నాకూ వేస్తోంది,

ధన : (విసుగ్గా) వేస్తుంది, నాయనా, వేస్తుంది!- దానికి లోటేమీలేదు- అన్నట్లు, శాంతా! మధ్యాహ్నం భోంచేశాడే ఆయన ఈపూట కూడా ఇక్కడే భోంచేస్తారు. ఖర్మ!

శాంత : సరే, నాన్నా! (M. B. లోకి వెళ్ళిపోతుంది.)

ధన : ప్రసాదం!-నువ్వు లోపలి కెళ్ళి చెవలయ్యనోసారి పంపించు (ప్రసాదం తల ఊపి R. F లోకి వెడతాడు. ధనరాజు విసుగ్గా తలపట్టుగుని కూచుంటూడు.)

చెవ : (R. F. లోంచి వచ్చి) ఏం, బాబయ్యా?

ధన : (నిట్టూరుస్తూ) హుఁ!- ఆయనగారి స్నానం అయిందిరా!

చెవ : అవుతోందండి.

ధన : ఇంత సేపేమిట్రా?

చెవ : ఇప్పుడే కదండీ పులుసుపోసి వచ్చాను!

ధన : ఖర్మ, పులుసేమిట్రా?

చెవ : తలంటుకుంటూరంటే కుంకుడుకాయలు కొట్టానండి.

ధన : (కోపంతో) ఏడవలేకపోయావు క్షణం ఇంట్లో లేకపోతే ఇదీవరస- ఎవరిచ్చార్రా, సీకూ?

చెవ : అమ్మాయిగోరండి.

ధన : మీ౦కందరికీ మతులు పోతున్నాయేమిట్రా? వాడి కెందుకురా, ఇవన్నీనూ ?

చెవ : నాకేటి తెలుసునండీ ?- ఏవో, మీ౦స్నేగితులంటే-

ధన : స్నేహితుడు కాదూ, బంధువూ కాదు- కొంపమీద వాలిన రాబందురా, వాడు! ఇహ లాభంలేదు! (ఇటూ అటూ కంగారుగా తిరుగుతూ) వీణ్ణి త్వరగా తోలెయ్యాలి, (బాధగా) చిటికెలో వస్తానన్న చింతయ్య చీకటడ్డా రాలేదు, ఖర్మ!- వీడే మయ్యాడో?

చెవ : చింతయ్యేనాండి ? భోగారావుగారింటి కెళ్ళి చూసి రానాండీ?

ధన : నే నిప్పుడకణ్ణించేకదురా, వస్తూంట ?-వాడురాందే! ఇహ రాత్రికి రాడు. అంచేత మన జాగ్రత్తమీద మనం ఉండవలసిందే, ఒరేయి! - మాట!- (మెల్లిగా) ఆయనొస్తున్నాడేమో, చూడు ?

చెవ : (R. F. లోకి పరిగెత్తి కెళ్ళి చూచి వచ్చి చిరునవ్వుతో) రాటం నేదండి?

ధన : (కసిగా) ఎన్ని కుంకుడుకాయలు కొట్టావురా?

చెవ : (రెండుచేతులూ జేర్చి, భయంగా చూస్తూ) ఇన్నండి!

ధన : అన్నందుకు కొట్టావురా, ఖర్మ!- సరే, ఇల్లారా!- నాడు రాత్రి ఊహాయించెయ్యకుండా జాగ్రత్తగా చూస్తూండాలి- తెలిసిందా?

చెవ : మనకెందుకండి, ఈబాధంతానూ! ఆయన్ని పొమ్మన కూడదూ?

ధన : పొమ్మంటే డబ్బెల్లా వస్తుందిరా?

చెవ : ఏం డబ్బండీ?

ధన : (కోపంగా) నీశార్థం డబ్బు! (R. F కేసి చూసి, భయంగా) ఉష్! - ఆయనొస్తున్నాడు. (అని కంగారుగా ఏమీ ఎరగనట్లు కూడుంటాడు. చెవ లయ్య గబుక్కున చతకిలబడి ధనరాజు కాళ్ళు గబగబా పిసుగుతూంటాడు.)

ప్రసా : (R. F. లోంచి వస్తూ) బావా!-బావా!

ధన : (తెల్లబోయి కాళ్ళు తప్పించుగుని) హారి నువ్వా!

ప్రసా : అవును, నేనే, బావా!

ధన : (విసుగ్గా లేచి) అఘోరించ లేకపోయావు! ఎందు కొచ్చావ్ అన్నట్టు, ఆయన్ని నీళ్ళగదిలో వదిలేసి, నువ్విల్లా చక్కావచ్చావేరా?- దొడ్డిదారమ్మట చక్కాపోతాడో ఏమిటో, ఖర్మ!- నువ్వెళ్ళరా చెవలయ్య పరిగెత్తు (చెవలయ్య R. F లోకితొందరగా వెడతాడు.)

ప్రసా : ఇందాకా ప్రెసిడెంటుగా రొచ్చారు, బావా!– చెప్పడం మర్చిపోయాను.

ధన : వచ్చాడూ? యములాళ్ళంతా ఒక్కసారే దిగుతారు!

ప్రసా : దిగి, నీకు చుట్టలిచ్చి లేచిపోయాడు.

ధన : (ఆశ్చర్యంగా) ఏం చుట్టలురా?

ప్రసా : అణాకి ఒకటిరకం!– ఇదిగో! (అని ఇస్తాడు)

ధన : (అనుమానంగా పుచ్చుగుని, వాసన చూసి, మెచ్చుగుంటూ) మరే!– మంచిరకమే!– ఈ ఏడు ఓట్ల కోసం ఈ పద్ధతి మొదలెట్టాడేమిటి, చెప్మా?

ప్రసా : అబ్బే!– నేనే మొదలెట్టించా!

ధన : ఖర్మ! అదెల్లా?

ప్రసా : (ఉత్సాహంగా) మనింటి కొచ్చినాయన కలెక్టరని చెప్పాను. దాంతో హడలిపోయి, చుట్టలొదిలి, ఆశాశమంటాడు!

ధన : అదేం రోగంరా నీకూ? గుట్టుగా నేనేదో లాభం చేసుగుందాం అనుకుంటే, నువ్వీ అల్లరేమిట్రా?

ప్రసా : ఆ!– మొన్న ప్రెసిడెంటు పెద్ద టోపీధానని చెప్పావుగా?– అంచేత, ప్రెసిడెంటుకి నా టోపీ చూపిద్దామని అల్లా చెప్పాను! (M. B. లోంచి కాంత, "మావా!–" అని పిలుస్తుంది)

ధన : (ప్రసాదాన్ని తినేలా చూస్తూ, మీది కేసుతూ) అసలూ!-

ప్రసా : (ధనరాజుని పెద్దపనున్నట్టు, ఆపుతూ) బావా!

ధన : (గబుక్కుని ఆగి) ఏరా?-

ప్రసా : శాంత పిలుస్తోంది కాస్సేపు అల్లానే ఉండు. ఇప్పుడే వస్తాను.

(అని M. B. లోకి గబగబ వెళ్ళిపోతాడు)

ధన : (విసుగ్గా మట్టితీసి కొరికి) ఖర్మ కొద్దీ దొరికాడు, అప్రాచ్యుడు!

[L F. దాకా నడిచి, వెనక్కి తిరగాటప్పుడికి R. F. లోంచి రామారావు వస్తాడు. ఇస్త్రీపంచకట్టుగుని, కొంచెం వదులు సిల్కుచొక్కా, పాతరకం, తొడుక్కుని ఉంటాడు. ధనరాజు ఆ బట్టలకేసి వెత్తెత్తినట్టు చూస్తాడు.]

రామా: (చిరునవ్వుతో) వేషం వింతగా ఉందనా, అల్లా చూస్తున్నారు? పంచ ఫరవాలేదుగాని, చొక్కా మాత్రం కొంచెం వదులయింది!

ధన : (కసిగా) మరే! మరే!

రామా: (చిరునవ్వుతో) మీపెళ్ళికి కుట్టించుగున్నార్టగా, ఈచొక్కా?

ధన : (బాధగా) మరే! మరే!

రామా: (మంచిగా) ఇవన్నీ న కెందుకంం డిప్పుడూ, మీకు చాదస్తంగాని!

ధన : దానికేం లెండి! (కోపంగా నవ్వి) మా చెవలయ్యే ఇచ్చాడాండీ, ఇవన్నీనూ?

రామా: ఊఁ! అతనేనండి! చాలా మంచివాడు.

ధన : (కోపంతో) మరే! మరే!

రామా: అన్నట్టు, చింతయ్య వచ్చాడాండి?

ధన : (నిట్టూర్చి) ఇదో టి, ఖర్మ! రాలేదండీ! వాడింటికి కూడా వెళ్ళొచ్చాను!

రామా: అయితే రాత్రికి కూడా నేనిక్కడ ఉండవలసిందే?

ధన : ఏంచేస్తాం, మరి? బేరం ఇచ్చుగున్నాక మాకు తప్పదు! హామీ ఉన్నాక మీకు తప్పదు!

రామా: (సిగరెట్టు వెలిగించి) ఇదెక్కడ హామీ అండీ, ఛస్తున్నాను! అవతల నాకు బోల్డు పన్లున్నాయి!

ధన : అల్లానేనండి! రేపు ఉదయమే ఆ డబ్బు ఇల్లా అందగానే మిమ్మల్ని అల్లా పంపించేస్తాను.

రామా: (నిట్టూర్చి) బాగానే ఉంది!

చెవ : (R F. లోంచి వచ్చి) భోజనాలకి రమ్మంటున్నారండి!

ధన : (బకాసురుడులా మొహంపెట్టి, లేస్తూ) అల్లానేలే! ఛో లోపలికి! (చెవలయ్య కారణం తెలియక తెల్లబోతాడు.) రండి, వెడదాం! (M. B. లోంచి హుషారుగా ప్రసాదం వస్తాడు. భుజంమీాద తువ్వాలుంటుంది) మళ్ళీ నువ్వెక్కడికిరా?

ప్రసా : వేన్నీళ్ళు పోసుగోడానికి !

ధన : వీడిదో వెఱ్ఱిగోల ! ఇప్పుడు వేన్నీళ్ళెందుకురా ?

ప్రసా : (ఒకక్షణం ఆలోచించి) పోసుగోడానికి !

ధన : ఖర్మ! త్వరగా తెములు! ఇదండి, వీడివరస ! వీడికి అక్కర్లేంది అంటూలేదు. మొన్నా ఇంతే! గుండె జబ్బుగా ఉందని మందు నేను తెచ్చుకుంటే, ఆ సీసాడూ వాడు తాగి కూచున్నాడు. (ప్రసాదం కోపంగా చూస్తాడు.) ఏరా అంటే మూరెడుకోపం ! వాళ్ళ ఊరు పోతానంటాడు. చంపేస్తున్నాడనుకోండి. (ప్రసాదం విసురుగా R.F. లోకి వెడతాడు.) ఖర్మ, మీరు నడవండి! (చెవలయ్య, రామారావు R. F. లోకి నడుస్తారు)... చెవలయ్యా !

చెవ : (R. F. లోంచి వచ్చి, ఆదుర్దాగా) ఏం బాబయ్యా!

ధన : (చిన్న కంఠంతో, తెగకోపంగా) నా సిలుకుచొక్కా వాడి కెందు కిచ్చావురా ?

చెవ : (బిక్కచచ్చి) ఛమించండి, బాబయ్య!- పొరపాటయిపోయిందన్నానుగా ?

ధన : ఎల్లాగరా నీతో చావడం !-అయితే మన అప్రాచ్యుడికి కూడా కొట్టావా కుంకుడుకాయలు ?

చెవ : (తలవంచుగుని, బాధగా) సిత్తం !

ధన : ఆ ! (ఏడుపు, కోపం, మింగి) రామచంద్రప్రభో !- ఒరేయి, నాకింత విషం కూడా తెచ్చిపెట్టు !

చెవ : (బాధగా, తలవంచుగునే) సిత్తం !

ధన : (కోపంగా) నీ శ్రార్ధం!- లోపల హామీదాసున్నాడు. త్వరగా వెళ్ళు ! (చెవలయ్య R. F.లోకి పోతాడు) నాకు తెలుసు !- తెల్లారేప్పుడికి నా ప్రాణం పోతుంది ! (బాధగా R. F. లోకి నడుస్తాడు.)

(తెర)

## రంగం-3

[ధనరాజు ఇంట్లో అదేహాలు. రామారావు, ప్రసాదం L. F. కి ఇవతలగా రెండుకుర్చీల్లో కూచుంటారు. ఎదురుగాఉన్న చిన్నబల్లమీద నాలు గైదు ఖాళీప్లేట్లుంటాయి. ఇద్దరూ కాఫీ తాగుతూంటారు. ధనరాజు, నెత్తిమీద చేతు లెట్టుగుని, మధ్యకుర్చీలో కూచుని, ఏడుపు మొహంతో వాళ్ళ కేసి, ప్లేట్లకేసి ఒరగా చూస్తూంటాడు.]

ప్రసా : (హాయిగా త్రేణ్చి) బావా !–

ధన : ఏరా ?

ప్రసా : ఉహ్మ్, ఇడ్డెన్లూ మానేస్తే మానేశావుగాని, ఇదిగో ఈకాఫీ తాగు ఎంత బావుంనో !

ధన : నా కక్కర్లేదు.

ప్రసా : పోనీ పంచదార వేసుగుని పాలు తాగుతావా ?

ధన : (విసుగ్గా) నాకొద్దురా అంటే !–

ప్రసా : పోనీ ఉత్తిపాలు తాగుతావా ?

ధన : (కోపంగా) ఖర్మ్, నీగొడవేమిట్రా, మధ్య ?– నా కేమీవద్దు !– ఒరేయి, చెవలయ్యా, చెవలయ్య !

చెవ : (R. F. లోంచి వస్తూ) బాబయ్య !

ధన : (విచారంగా చూస్తూ) అంతా అయిపోయింది !– ఇంక ప్లేట్లూ అవీ తీసెయి !

ప్రసా : (ప్లేట్లుతీస్తున్న చెవలయ్యతో మెల్లిగా) ఇంకా ఇడ్డెన్లున్నాయా, చెవలయ్యా !

ధన : (విని, కంగారుగా లేచి) ఇడ్డెన్లు కాదు, ఇటికె లున్నాయి !– ఇంకా ఎన్ని తింటావురా ?– సంతర్పణ

భోజనానికి కూచున్నట్టు ఏమిటాతిండి ?- లే ఇంక!- లేచి, లోపలి కెళ్ళు !

[ప్రసాదం కోపంగాచూసి R. F. కేసి నడుస్తాడు. శివలయ్య కప్పులూ, ప్లేట్లూ తీసుకుని R. F. లోకి వెళ్ళిపోతాడు. L F. లోంచి "ధనరాజుగారూ_" అని కేకేసి, చింతయ్య చిరునవ్వుతో వస్తాడు.]

చింత : దణ్ణాలండి !

ధన : ఎవరూ ?- చింతయ్యే ! (ఆనందంతో) రావోయి, రా !- నీకోసమే చూస్తున్నాను. (అంటూ చింతయ్య కేసి రెండడుగులు వేసేసరికి, వెనకనించి ప్రసాదం గబగబా నడిచి చింతయ్య దగ్గిరకి చేరతాడు.)

ప్రసా : ఏం, చింతయ్యా ! ములక్కాడలు తెచ్చావా ?

ధన : (విసుగ్గా) నువ్వుండరా, కాస్సేపు ?-ఆ, చింతయ్యా! నిన్ననే వస్తానన్నవుగా ? ఇంత ఆలస్యం అయిందేం ?

చింత : ఏం చెయ్యనండీ ?- నేను తీరా గోపారం వెళ్ళాక, నారాయణరావుగారు మాచారం వెళ్ళారన్నారు.

ప్రసా : (మళ్ళీ ముందుకొచ్చి) పోనీ మాచారంలో ముల క్కాడలు విరగ కాస్తాయిట: కనుక్కో లేక పోయావు ?

ధన : నీ ములక్కాడలు మండిపోనూ, కాస్సేపు మాట్లా డకురా !- అయితే, చింతయ్యా !- ఆయన దొరకనే లేదేమిటి ?

చింత : దొరక్కపోతే, నేనూరుకుంటానాండీ ?-సాయింత్రం దాకా అరుగుమీదే కూకుని ఆయనొచ్చాకనే అక్క డింకానండీ !

ధన : (ఉత్సాహంగా) గట్టివాళ్లే వొత్తానికి! డబ్బిచ్చారా?

చింత : మీరు రాసిన ఉత్తరం ఇచ్చాను. ఆయనగారు చదువుకుని, "సీకటడిపోయిందిరా, సింతయ్యా! - ఎండలకాడే ఎడుదువుగాని, రాత్రికిఉండిపో!" అన్నారండి. మారాజు మా చెడ్డమంచోరండి!

ధన : ఆ, ఆ! చాలా మంచివారు. నాడబ్బేదీ?

చింత : నాకివ్వ లేదండీ!

ధన : ఆయనే పట్టుగొస్తున్నారా?

చింత : ఆ ముక్క-మీ చెప్ప లేదండీ!

ధన : (కోపంగా) అయితే పొద్దున్నే లేచి, ఖరాగా చేతులు ఝాడించుకుంటూ చక్కా-వచ్చావా!

చింత : లేదండీ!- ఉత్తరం పట్టుగొచ్చాను.

ధన : ఎవరికి?

చింత : మీకేనండి.

దన : ఎందుకూ?

చింత : ఏమోనండి.

ధన : (ఉత్తరం తీసుకుంటూ) ఉత్తరాలూ, పత్తరాలూ ఎందుకూ, నా సొమ్ము నాకు పడెయ్యక?

చింత : (ప్రసాదంతో) కాసిని మంచినీళ్ళిప్పించండి, దాహంగా ఉంది!

భూషా : (జాలిగా చూస్తూ) దాహంగా ఉందా?- చిక్కటి మజ్జిగ తేనా?

ధన (హాశిలిపోయి) నీ మజ్జిగ మండిపోనూ !– అతను నీ ళ్ళడుగుతూంటే నువ్వు మజ్జిగంటా వేమిటే, జలుబు చెయ్యడానికి !– చెప్పింది, చెయ్యి, చాలు !

(ప్రసాదం చిరికోపంతో R. F. లోకి వెళతాడు)

రామా: చింతయ్యా! ఏమన్నారోయి, జమీందారుగారు!

చింత : (ఓరగా చూసి నవ్వి) గాలి బాగానే ఊదన్నారండి!

ధన : గాలి కేంగాని, ఉత్తరం ఇంత రాశాడేమిటీ?...... (ఉత్తరం చదువుతూ) 'మీ ఉత్తరం అందింది. మా స్నేహితుడు రామారావు రెండు రోజులక్రితం ఏ కారణం లేకుండా మాయమయ్యాడు. కంగారు పడుతూ దేశదేశాలూ గాలిస్తున్నాము—అతన్ని మీ ఇంట్లోనే దాచినట్లు ఇప్పటికేనా ఆవార్త ఇచ్చి నందుకుచాలా సంతోషం)!–(ఉత్తరంచదవడం ఆపి) ఇదేమిటోయి, గొడవ ? ఈయన్ని నేనెత్తుగొచ్చా నంటాడేమిటీ?–తనేగా తీసుగొచ్చి నా నెత్తిమీదికి దింపాడూ? అసలు ఈ ఉత్తరం నాకేనా ?

చింత : ఆ, మీకేనండి! (ప్రసాదం R. F. లోంచి మంచి నీళ్ళగ్లాసుతో తెచ్చి, చింతయ్య కిస్తాడు చింతయ్య గడగడా తాగేస్తాడు.)

ధన : తెగతాగి. మతిపోయి రాసిన రాతలాఉందిది. అర్థం పర్థం లేకుండా ఏమిటీ రాత ?

చింత : ఏమో నాకేం తెలుసండి?—ఆరే వస్తున్నారు, మీరూమీరూ సూసుగోండి. నేను పోతున్నాను. (L. F. కేసి వెళుతూంటాడు.)

ధన : (కంగారుగా) చింతయ్యా!

ప్రసా : (L. F. కేసి తొందరగా వెళ్ళి) చింతయ్యా!

చింత : (L. F. చివర ఆగి వెనక్కి తిరిగి) ఏటండీ?

ప్రసా : ములక్కాడ లేవీ?–బావడుగుతున్నాడు!

ధన : (పిచ్చికోపంతో) దిక్కుమాలిన ములక్కాడలు, లోపలికి పోరా, నువ్వు!–(చింతయ్య నవ్వుకుంటూ L. F. లోకి పోతాడు.)

ఖర్మ!–(ఉత్తరం తిరిగి చదువుతూ) (మనుష్యుల్ని లోబరుచుగుని నిర్బంధంలో ఉంచెయ్యడం నేరం. ఆ మనిషిని విడుదలచెయ్యడానికి 500 రూపాయలు కక్కమనడం సాహసంతో కూడిన ఘోరనేరం! మీ ఉత్తరం నన్నేమీ భయపెట్టలేదు. నేనొక్క కానీకూడా మీకివ్వను!) (తెల్లబోయి) ఆ!–(మళ్ళీ చదువుతూ) (అంతేకాదు! వెంటనే బయల్దేరి పోలీసుల్తో సహా మీ ఇంటికి వస్తున్నాను!) (చదవడం ఆపి, భయంగా చూస్తూ) పోలీసులు కూడానా, ఖర్మ!–(మళ్ళీ చదువుతూ) 'మేం వచ్చేలోపల మాస్నేహితుణ్ణి మాయంచేసినా, మరేంచేసినా మర్యాద దక్కదు, జాగ్రత్త!– నారాయణరావు'– (ఉత్తరం

నేలమీాద ఒదిలేసి, మతోయినట్టు చూస్తూ) ఏమిటీ విపరీతం!- పీడిరాతమండా? అయిదు బస్తాలూ తను కాజేసి, నేరాలేవో నేను చేశానంటాడేమిటీ! — ఏమిటండీ, రాత!- ఇదేనా మర్యాద?

రామూ: దాంట్లో తప్పేముంది?-నిన్నణ్నుంచీ మీారు నన్ను నిర్బంధంలో ఉంచలే?

ధన : ఆ,-ఉంచితే?

రామూ: పైగా అయిదువంద లిస్తే నన్ను వదల్నంటున్నా రుగా?

ధన : అనను మరి!

రామూ: అంతే!

ధన : అంతే ఏమిటి? నా సొమ్ము నేనడిగాను, అందులో తప్పేముందీ? అయిదుబస్తాలూ బేరమాడి పట్టి గెళ్ళాడుగా, మరీ?

రామూ: ఎమో, నాకేం తెలుసూ?

ధన : (హడిలిపోయి) అయ్యో!-అయ్యో!-అల్లా మొహం మీాద అబద్ధ మాడేస్తారేమిటండీ, మరీను? అయిదు బస్తాలూ పట్టిగెళ్ళకదూ, మీావాడూ?

రామూ: నేను చూాళ్ళేను.

ధన : (తెల్లబోతూ) ఆ!-

ప్రసా : (మంచిగా) ఆ, నేనూ చూాళ్ళేదు.

ధన : ఏమవలేక పోయావు!-ఏమయ్యాయిరా, ఆ బస్తాలు!

ప్రసా : (జాలిగా) మరు పెక్కువ, మా బావకి!-కోట్టుమీంద కెళ్ళాయన్నావుగా, నిన్న?

ధన : హోరి త్వాష్ట్రం! శనిగాళ్ళంతా కొట్టుకొచ్చారు, నాకొంప ముంచడానికి. ముందు నువ్వు లోపలికి, ఫో!

[ప్రసాదం విసురుగా R. F. లోకి వెళ్ళిపోతాడు ధనరాజు రామా శావుకేసి ధుమధుమ లాడుతూ చూసి, ఇటూఅటూ పచార్లు చేస్తూం టాడు.]

ఇంతకన్నా దారుణం ఏమన్నా ఉంటుందా? హాయి దుబస్తాలూ తను పట్టుకుపోయి, మేకెట్టి కొట్టినట్టు ఈ మనిషిని నానెత్తిమీద దింపి, పైగా నన్ను పోలీసులకి అప్పజెపుతాట్ట!-పోలీసులు!!-చెవలయ్యా! చెవలయ్యా!

చెవ : (R. F. లోంచి వచ్చి) ఏం. బాబయ్యా!

ధన : పాతకోటేసుగు తిరుగుతాడూ, ప్లీడరు పాపారావు గారు, ఆయన్తోటి నేను అర్జంటు పనిమీద వస్తున్నానూ ఇంటిదగ్గిర ఉండమని చెప్పిరా, వెళ్ళు!

చెవ : సిత్తం! (చెవలయ్య కంగారుగా L. F. లోకి వెడతాడు.)

రామం: (లేచి, ఒళ్ళు విరుచుకుని, ఆవలించి టైము చూసుకుని) అబ్బా!- పదయిందీ! ఊఁ! ధనరాజుగారూ, నీళ్ళు కాగా యేమో కనుక్కోండి, పోసుకుంటాను!

ధన : ఇంకా ఈ దండగకూడా ఎందుకూ ?– నీళ్ళ్యా లేవు, నిప్పుల్లేవు. అల్లాకూచోండి, మీావాడు వచ్చే దాకాను.

రామం: అల్లాగా?–అయితే అన్నం నీళ్ళు లేకుండాచేసి ఈ గదిలో పెట్టి నన్ను మాడ్చి చంపేస్తా రేమిటండీ?– ఏమిటసలు మీా ఉద్దేశం ?

ధన : రామరామ! అవేం మాటలండీ? ఎవరైనా వింటే నిజం అనుకుంటారు కూడాను!

రామా: నిజం కాక ఇందులో అబద్ధమేముందీ? నాకు రోజూ ఏడయ్యాటప్పటికి వేన్నీళ్ళ స్నానం చెయ్యడం అలవాటు. అప్పుడే పది దాటింది. నాదసలే గడియారం శరీరం. వేళపట్టుని అన్నం నీళ్ళా అమర్చక పోతే గుండె ఠక్ మని ఆగి ఊరుకుంటుంది. ఆ తరువాత నారాయణరావుగారికి మీారే చెప్పాలుగుందురు గాని, సమాధానం!

ధన : ఇదోటా నా కొంపమీాదికి? ఖర్మ!– ఒరేయి. ప్రసాదం!– ప్రసాదం!

ప్రసా : (తాపీగా R. F. లోంచి వచ్చి) ఏం బావా?

ధన : చెవలయ్య నీళ్ళెట్టాడ్రా?

ప్రసా : ఎక్కడ ?–

ధన : (విసుగ్గా) నీళ్ళు పొయ్యిమీాదరా!

ప్రసా : [illegible]!

ధన : అదుగో, ఆయన స్నానంచేస్తార్ట!- నీళ్ళగదిలోకి దీసుగెళ్ళు!

ప్రసా : ఓః, రండి! (ప్రసాదం, రామారావు R. F. లోకి వెడతారు)

ధన : ప్రసాదం!-

ప్రసా : (R. F లోంచి వచ్చి) ఏం బావా?

ధన : (మెల్లిగా, ఆదుర్దాగా) ఆయన పారిపోకుండా జాగ్రత్తగా చూస్తూండు.

ప్రసా : (మెల్లిగా, ఆదుర్దాగా) ఓ!- అసలు రెప్పయ్యను! (అని R. F. లోకి వెడుతాడు)

ధన : (తల కొట్టుగుని) ఈ చిక్కులోంచి ఎప్పుడు బయట పడతానోగాని, ఈ హోమీదాసు వాసాలుకూడా తినేశేలా ఉన్నాడు! (అటూ ఇటూ కంగారుగా పచార్లు చేస్తూంటాడు)

చెవ : (L. F. లోంచి వస్తూ) సెప్పానండీ! త్వరగా రమ్మన్నారు. వచ్చేటప్పుడు తమర్ని ఓఅణా ముక్కపొడుం కొని పట్రమ్మన్నారు.

ధన : ఖర్మ!- ఇవ్వబోయే సలహాకి ఇది బజానాగావును!- అయినా అంతముక్కపొడుంఎందుకురా?-తింటాడా?

చెవ : ఏమోనండి. మనిషి వాటంచూస్తే తినేలాగే ఉన్నాడు!

ధన : హు!- ఇదుగో, నేను వెడుతున్నానుగాని, ఇల్లు జాగ్రత్త!- దొడ్లో హోమీదాసు నీళ్ళోసుగుంటున్నాడు. ప్రసాదం ఉన్నాడనుకో, అయినా ఓకంట,

కనిపెడుతూంది. ఇప్పుడే వచ్చేస్తాను ! (కంగారుగా L.F లోకి వెడతాడు.)

చెవ : (నిట్టూర్చి) అయ్యగారి అవత్త సూత్తూంటే జాలేత్తోంది. యమబాధ పడిపోతున్నాడు, ముసిలాయన! పోనీ సాయం సేద్దారంటే సంగతేటో వివరంగా సెప్పడు !

ప్రసా : (R. F. లోంచి వచ్చి) ఏరా, చెవలయ్యా ! సంధి పేలాపనలాగ ఒక్కడివూ కూచుని అల్లా సణుక్కుంటున్నావేం ?

చెవ : ఆ !– అయ్యోయ్యో !– మీరిల్లా చక్కావచ్చేరేం ? ఆయనగారు పారిపోతాడో ఏటో.

ప్రసా : కంగారుపడకురా, సీతాపతి ! ఆయనగారు ఇంకా నీళ్ళోసుగుంటూనే ఉన్నాడు. పైగా ఇప్పుడప్పుడే తెమిలేలా కనపడలేదు. అంచేత ఇంకా నుంచో డానికి విసుగేసుగొచ్చి, మన పోట్లావులేదూ, పెద్దది !– దాన్ని ఆగుమ్మానికి అడ్డంగా కట్టే సొచ్చాను. ఆయనగారు నీళ్ళోసుగోడం అవగానే వెంకు లెగిరేలా అరుస్తాడుగా ? అప్పుడు మనం వెళ్ళి తీసుగురావచ్చు !

చెవ : మా పెద్ద ఆలోచనయ్యా నీది !

ప్రసా : ఏంలాభం? ఆసంగతి ఆసలువాళ్ళకి తెలియటంలేదు.

చెవ : అది సరేగాని, బాబయ్యా !– రామారావుగారూ, ధనరాజుగారూ ఏటి గోడవపడుతున్నారు ?

ప్రసా : మాటే పడుతున్నారు.

చెవ : ఎందుకూ ?

ప్రసా : (ఆలోచించి) అదా ?— రామారావుగారు వాళ్ళ ఊళ్ళు పోతానంటాడు. బావ వెళ్ళద్దంటాడు. ఇంతలో చింతయ్య వస్తే, బావా, ఈయనా, చింతయ్యా దెబ్బలాడుకుని చివరికి చింతయ్యని గోపారం పంపించారు.

చెవ : ఎందుకూ ?

ప్రసా : ఎందు కేమిట్రా ?— నారాయణరావుగార్ని అడిగి అయిదువందలు పట్రమ్మన్నాడు బావ. దొరికినన్ని ములక్కాడలూ కోసుగురమ్మన్నాను, నేను ! పోనీ ములక్కాడలు ఓటీచెప్పి ఊరుకుంటే బాగుండునా? డబ్బుకూడా తెమ్మన్నాడు, దాంతో రెండూ తవరమయ్యాయి !

చెవ : అయితే అయిదు బత్తాలడబ్బా అరువెట్టి ఎల్లారన్న మాట జమీందారుగారు !

ప్రసా : నీ మొహం, బస్తాలు మనకొట్టుమీదకే వెళ్ళాయిరా!

చెవ : నేదండి !— నేనేగా ఆ బత్తాలు జమిందారుగారి బండిలో ఏస్తా ?

ప్రసా : మరి !— బావ మంతో అల్లా చెప్పాడేం ?

చెవ : అదే అర్థమవక సత్తున్నాను. ఇందులో ఏదో గొప్ప గొడవుంది. నేకపోతే నిచ్చేపంలాంటి మనిషి నిమిషానికి రెండుమాట్లెందు కాడతాడు ?

ప్రసా : (తలపంకిస్తూ) సంబంధం లేకుండా మాట్లాడుతున్నాడు, అవునా ?

చెవ : సిత్తం !

ప్రసా : ఉత్తి పుణ్యాన్ని కస్సుమంటున్నాడు, అవునా? (చెవలయ్య జాలిగా తల ఊపుతాడు.) అదీసంగతి!

చెవ : ఏదీ?

ప్రసా : మొన్నరాత్రి మాబావ పొలం వెళ్ళాడు, జ్ఞాపకం ఉందా?

చెవ : అవును!

ప్రసా : ఆచీకట్లో ఈయన్ని ఏ పిచ్చికుక్కో కరిచిఉంటుంది. సందేహంలేదు.

చెవ : (తెల్లబోయి) ఆ!–

ప్రసా : (ఆదుర్దాగా) ఆ! మనం జాగ్రత్తగా ఉండడం మంచిది. పళ్ళు పైకెట్టగానే పదిమైళ్ళు పరిగెత్తాలి, తెలిసిందా? పిచ్చాళ్ళ నాలిక పొడుగు ఎక్కువట!

చెవ : (కోపంగా) ఛఛ, ఊరుకోవయ్యా!– మంచీ చెడ్డా లేకుండానూ!

ప్రసా : (అనుమానంగా చూస్తూ) ఒరేయి!– మొన్నరాత్రి నువ్వూ పొల మెళ్ళా వేమిట్రా?

చెవ : (విసుగ్గా L. F. కేసి తిరిగి L. F. లోంచి జాగ్రత్తగా ప్రవేశిస్తున్న ప్రెసిడెంటునిచూసి) దణ్ణాలండి!

ప్రెసి : (జాగ్రత్త అన్నట్టు కుడిచూపుడువేలు, ముక్కుమీద పెట్టుగుని) ఉష్!

ప్రసా : (తాను కూడా ప్రెసిడెంటు దగ్గరికి అతి జాగ్రత్తగా వెళ్ళి, అల్లానే వేలుపెట్టి) ఉష్!

ప్రెసి : (ప్రసాదంతో మెల్లిగా) కలక్టరుగారున్నారా?

ప్రసా : (కళ్ళు పెద్దవిచేసి, వేలు అల్లానే ఉంచి) ఉష్!

ప్రెసి : (చిరుకోపంతో మెల్లిగా) నీ ఉష్షుముండ!- కలెక్టరు గారున్నారటయ్యా!
ప్రసా : (మెల్లిగా) ఉన్నారు!
ప్రెసి : ఏం చేస్తున్నారు?
ప్రసా : (ఆలోచించి) ఎందుకూ?
ప్రెసి : (ప్రసాదాన్ని L. F. వైపు తీసుగెళ్ళి) ఇందాకా తాసిల్దారుగారు జీపు కారుమీద వెడుతూ మన బజార్లో కనపడ్డారు. కాఫీ తాగి వెడుదురుగాని ఇంటికి రమ్మన్నాను.
ప్రసా : (నవ్వి) ఒహో!-పాలు తక్కువయ్యాయూ?-అరెరే! ఈవేళ పొద్దున్నే పాలుపితగడానికి మా చెవలయ్య చెంబుచ్చుగుని వెడితే మా గేదె ఒక్క తన్ను తన్నింది? దాంతో చెవలయ్య గోడకి చేర్లబడి పోయాడు, చెంబు గోడవతల పడింది.
ప్రెసి : నీ గోల బంగారంగానూ, నాకు పాలూ వద్దు, చెంబూ వద్దయ్యా!- చెప్పింది, విను!
ప్రసా : ఏమిటీ?
ప్రెసి : ఆయన, 'కాఫీకి రావడానికి వీల్లేదు, అర్జంటు పని మీద వెడుతున్నాను' అన్నాడు. 'ఏమిటదీ,' అన్నాను, అంటే 'కామారంలో కలెక్టరు, కేంపే శాడు, నిమిషాల మీద రమ్మన్నాడు, వెళ్ళాలి', అన్నాడు. 'నయమే, అనవసరంగా శ్రమపడిపోదురూ, కలెక్టరుగారు మన ధనరాజుగారింట్లో మకాం ఉన్నారు,' అని మాట సాయం చేసి తీసుగొచ్చాను.

ప్రసా : (ఆదాలాభంగా నవ్వి) అల్లానా? – (ఆలోచించి, బిగుసుకుపోయి) అల్లానా!

చెవ : (తెల్లబోయి) కలెక్టరుగారా?

ప్రసా : (కంగారుగా) చెవలయ్యా!–మంచినీళ్ళు!–అర్జెంటు, పరిగెత్తు! (చెవలయ్య M. B లోకి తొందరగా వెళ్ళిపోతాడు. ప్రసాదం భయంగా గుటకేసి) తాసిల్దారుగారు మీ ఇంటి దగ్గిరే ఉన్నారా?

ప్రెసి : అబ్బే, మనింటికే తీసుకువచ్చాను. జీపు అవతలుంది!

ప్రసా : (మతిపోయినట్టు చూస్తూ) అవతలుందీ?– ఇప్పుడెల్లా?

ప్రెసి : నువ్వేం కంగారు పడకయ్యా!– 'కలెక్టరుగారు చాలా రహస్యంపని మీద వచ్చారు' అని తాసిల్దారుతో చెప్పాను.

ప్రసా : (ఆశగా చూస్తూ) ఆ! చెపితే ఏమన్నారు?

ప్రెసి : ఎక్కడున్నా సరే కలుసుకోమని ఆర్డరట!– ఏం చేస్తాడు? ఉద్యోగ ధర్మం!

ప్రసా : దిక్కు-మాలిన ఖర్మం! – ఎరక్కపోయి చెప్పాను. మా బావకీ సంగతి తెలుస్తే చంపేస్తాడు!

ప్రెసి : అనవసరంగా అంత భయపడతావెందుకయ్యా?– మీ బావసంగతి నేను చూస్తానుగాని, అసలు కలెక్టరుగారు నిద్దరోతున్నారా, మెళుకువగా ఉన్నారా?

ప్రసా : (ఆశగా చూస్తూ) గుఱ్ఱటి నిద్దరోతున్నారు!

ప్రెసి : ఊహు!–అయితే తాసిల్దారుగారిని లోపలికి వచ్చి కూచ్చోమని చెప్తాను.

ప్రసా : (హడిలిపోయి) చంపారు! - ఈయనతో మాట్లాడితేనే గాని, మీరు వెళ్ళరా ?

ప్రెసి : ఎల్లా ? కలెక్టరు ఆర్డరు !- వెడితే తాసిల్దారు ఉద్యోగం పోదూ ?

ప్రసా : ఉంటే నా ప్రాణం పోదూ ?- (ఆలోచించి) అదీ ! లేచారేమో చూస్తాను ఉండండి, మరి !

ప్రెసి : (అదుర్దాతో) ఇదుగో! నిద్దరోతూంటే లేపకుసుమా? (ప్రసాదం వినయంగా తల ఊపి మెల్లిగా మేడపైకి వెడతాడు. లోపలి కెళ్ళి, కలెక్టరు మాట్లాడుతున్నట్టు కంఠస్వరం మార్చి, గట్టిగా మాట్లాడుతాడు.)

ప్రసా : (కలెక్టరులా) ఎవరది ?- ఏం ప్రసాదం ?- నిద్దరోతోంటే లేపద్దని చెప్పలే ? (చెవలయ్య M B. లోంచి నీళ్ళగ్లాసు తెచ్చి ప్రెసిడెంటు పక్క బల్ల మీద పెట్టి, మేడవైపు తెల్లబోయి చూస్తూంటాడు, ప్రెసిడెంటు బెదురుతూ చూస్తూంటాడు.) ఎవరూ ?-తాసిల్దారా ?-అయితే. మాత్రం? తాసిల్దారెవడు, ప్రెసిడెం టెవడు ? (ప్రెసిడెంటు జావయిపోయి, గుటకేసి, పక్కనున్న గ్లాసుడు నీళ్ళూ తాగేస్తాడు.) అసలు వీళ్ళని ఎవరు రమ్మన్నారు ?- వీళ్ళకేం పనుల్లేవేమిటి? అవతలికి పొమ్మను?- వెళ్ళు ! (ప్రెసిడెంటు కళ్ళుమిటగరించి, చెవలయ్యకి దణ్ణం

పెట్టి, హడావుడిగా L. F. లోకి చక్కాపోతాడు. ఓక్షణం ఆగి ప్రసాదం మెల్లిగా మేడమీదాంచి, అను మానంగా ఇటూ అటూ చూసుకుంటూ వచ్చి, కుర్చీలో కూలబడి, నిట్టూర్చి) హమ్మయ్య! ఈయన పోయాడా?

చెవ : (మతిపోయినట్టు చూస్తూ) పోయాడుగాని, మేడ మీా దెవరున్నారు ?

ప్రసా : హు!–నేనూ నా సత్రకాయీను!

ధన : (L. F. లోంచి హడావుడిగా వస్తూ) ఒరేయి, అ జీపుకారూ, మనుషులూ ఎవర్రా ?–పోలీసులే ?

చెవ : తాసిల్దారుగారు కూడా వచ్చార్టండి!

ధన : ఖర్మ !–అప్పుడే అంతా దిగుతున్నారూ?– అయితే ఆ ప్లీడరు పాపారావు చెప్పింది నిజమే అన్నమాట ! (అంటూ కుర్చీలో కూలబడతాడు.)

చెవ : ఏంచెప్పాడండి. ప్లీడరుగారు ?

ధన : హామీా మనిషిని కదల్నియ్యకుండా ఆపడం నేరంట! పైగా మనమో తెలివితక్కువ కాగితంరాసి జమిం దారు చేతుల్లోపెట్టామట !– ఆ కాగితం వాడు పోలీ సులకిస్తే మనకి జైలు ఖాయంట !

చెవ : అయ్యబాబోయ్ !–

ధన : ఖర్మరా ఖర్మ !– అంచేత, ఆ కాగితం పోలీసుల చేతుల్లో పడకుండా, జాగ్రత్తగా చూసుకోమం టాడు !

ప్రసా : (చిటికేసి) పోనీ ఆ కాగితం ఇల్లా ఇచ్చెయి, బావా! ముక్కలకింద చింపేసి, గాల్లోకి ఊదేస్తాను!

ధన : ఏడవలేకపోయావు!— అన్నట్టు నువ్విల్లా వచ్చేశా వేరా? ఖర్మ, హామీమని పెడీ?

ప్రసా : ఆయనకేంగాని, అటునించి అసలు మనిషి వస్తు న్నాడు!

ధన : (విసుగ్గా తిరుగుతూ) ఎవరది?

నారా : (చిరునవ్వుతో L. F. లోంచి వస్తూ) నమస్కార మండీ!

ధన : (తెల్లబోయి, తట్టుకుని లేచి, కోపంగా) రండి బాబూ, రండి!— గంటలో డబ్బట్టుకుని వస్తానని అయిదుబస్తాలూ పట్టికెళ్ళి, రెండోరోజున కనిపి స్తారా?— ఇదేనా మర్యాద? పైగా పెంద్రాళే డబ్బిచ్చి హామీ మనిషిని తీసుకుపొమ్మని ఉత్తరం పంపి స్తే పాడుబుద్ధితో పెడర్థాలు లాగి, పైగా నేరాలేవో నేను చేశానంటామూ? ఎంత మోసం!— ఎంతఘోరం!—జమిందారు కొడుకుగదా అని అరు వి స్తే!—

నారా : (తాపీగా సిగరెట్ పీల్చి) అరువేమిటయ్యా?— ఈ కథలకేంగాని, మా స్నేహితు డేడీ?

ధన : ఆయి!—కథలా?— అయిదు కిచిలీబస్తాలు అరువట్టి కెళ్ళడం కథటండీ?

నారా : కథ కాకపోతే కల!— ముందు మావాణ్ణేం చేశారో చెప్పరేం ?

ధన : ఏంచేశాను ?—మనుగుడుపు పెళ్ళికొడుకులా కూచో పెట్టి మేపుతున్నాను. నీళ్ళోసుగోవడం అయిందేమో తీసుకురారా, చెవలయ్యా! (చెవలయ్య R. F. లోకి వెడతాడు.) ఏమండీ ?— మీకేంతేనా పుణ్య ముంటుంది, నా అయిదువందలూ నాకు పారె య్యరూ ?

నారా : ఎందుకూ ?—మావాణ్ణి ఎత్తుగుపోయినందుకా ?— మందెట్టి దాచేసినందుకా ?

ధన : రామరామ!— నేనెత్తుగు పోయానూ ?— ఇదెక్కడ అన్యాయమండీ ? మీరేగా హామీగా కూచోపెట్టి వెళ్ళారూ ?

నారా : హామీలేదు, ఏమీలేదు!— అవన్ని పోలీసులు వచ్చాక కనుక్కుంటారుగాని, ముందు మావాణ్ణి అప్పచెప్పండి!

ధన : అల్లానే!—అల్లానే! మధ్య మళ్ళి పోలీసులెందుకండి, ఖర్మ!— పోనీ నా అయిదుబస్తాల బియ్యం నాకు పారెయ్యండి!

నారా : ఏం బస్తాలయ్యా ?

ధన : (బాధగా) కిచిలీబస్తాలండి. అయిదు!

నారా : జీలకర్ర బస్తాలు, నాకేం తెలియదు!

ప్రసా : (చిరునవ్వుతో) పోనీ సింగినాథం బస్తాలు తెలుసా?

నారా : (విసుగ్గా) ఈ రామనాథం ఎవడూ?

ప్రసా : (హుషారుగా) జగన్నాథం తమ్ముడు!—

ధన : నీగోడవేమిట్రా, మధ్య?— (R. F. లోంచి చెవలయ్య వెఱ్ఱిచూపేసుగుని చక్కా-వస్తాడు.) ఏరా? ఆయనేడీ?

చెవ : నీళ్ళగదిలో నేరండి!

ధన : (హడిలిపోయి) ఏమయ్యార్రా, మరి?— దొడ్డితలుపు తీసుగుని పారిపోయాడో ఏమిటో!— పరిగెత్తిగెళ్ళి చూడరా!— వెళ్ళు! (చెవలయ్య R. F. లోకి మళ్ళీ పరిగెడతాడు.)

ప్రసా : (బాధగా) నా తువ్వాలుకూడా పట్టుగుపోయాడేమో!

ధన : (కోపంగా) మనిషి కనపడక మేం ఛస్తూంటే, తువ్వా లంటావేమిట్రా? వెధవ తువ్వాలూ నువ్వూను!— మేడమీద ఎక్కడేనా ఉన్నాడేమో, నువ్వుకూడా వెళ్ళి వెతుకు! (ప్రసాదం మేడమీదికి పరిగెడతాడు)

నారా : ఇదంతా ఏదో నాటకంలా ఉందే!—ఏదో దారుణం చేసి ఉంటారు!— ఏమండీ? అసలు మాస్నేహితుడు ప్రాణంతో ఉన్నాడాండీ?

ధన : ఖర్మ!—అదేం ప్రశ్నండీ?—మనిషి నిక్షేపంలా ఉంటేనూ?

నారా : ఏడీ, మరి?

ధన : నాకుమాత్రం ఏం తెలుసండీ ? నీళ్ళోసుగుఃటూనంటే వేన్నీళ్ళు పెట్టించి, నీళ్ళగదిలోకి పంపించాను, అంతే !

చెవ : (R. F. లోంచి మెల్లిగావచ్చి) దొడ్డి, ఈధి తెగ ఎతికానండి, బాబయ్యా ! ఎక్కడా కాపడలేదు !

ధన : ఎల్లాగరా, మరీ ?– మళ్ళీ వెతుకు !– వెళ్ళు ! (చెవ లయ్యి మళ్ళీ R. F. లోకి వెళతాడు. మేడమీాద నుంచి ప్రసాదం పరిగెట్టుగుంటూ వస్తాడు.)

ప్రసా : బావా ! బావా !

ధన : (ఆదుర్దాగా) కనిపించాడ్రా ?

ప్రసా : (ఆయాసపడుతూ) మరే, మేడంతా వెతిగాను !– కనపళ్ళేదు.. చివరికి– నీగదిలో కెళ్ళి పందిరిపట్టె మంచంకింద దూరి చూశాను !

ధన : (హాయిగా) అక్కడ దాక్కున్నాడా ?

ప్రసా : అదేచిత్రం !– అక్కడాలేడు !

ధన : (విసుగ్గా) అఘోరించినట్టే ఉంది, వెధవ చెప్పడం నువ్వాను ! ఇల్లాంటి వరకంలోట్రా వేళాకోళం ?

ప్రసా : వేళాకోళమేవిటి, వెతికొస్తేనూ ?

నారా : అయితే మీారంతా కలిసి అతణ్ణి ఏదో చేశారన్న మాటే ! లేకపోతే నిక్షేపంలాంటి మనిషి నీళ్ళ గదిలోనూ లేక, దొడ్లోనూలేక, ఇంట్లోనూ లేక, ఏమయిపోతాడండీ ?

ధన : (కోపంగా సమాధానం చెప్పబోయి ఆగి విసుగ్గా వెనక్కి తిరిగి) ఖర్మ!-ఎక్కపోయి ఒప్పుగున్నాను. ఈ దిక్కుమాలిన బేరానికి?

ప్రసా : (ఆలోచించి) పోనీ నూతులోకి కూడా తొంగిచూసి రానా, బావా?

ధన : ఏడిశావు, ఊరుకోరా!

నారా : నూతులో చూస్తావూ? ఏముంటుందోయి, ధనరాజు గారూ!- ఇదేం సామాన్యంగా లేదు!

ధన : (తలకొట్టుగుని) ఈ పిచ్చిపీనుగు మాటుచ్చుగుని మీరూ ఇదవుతారేమిటండీ? ఒరేయి, నువ్వు లోపలికి ఫో!

[ప్రసాదం కోపంగా M. B. కేసి చూస్తాడు. రామారావు ఓ పువ్వు చేత్తో పట్టుగుని, చిరునవ్వుతో, కులాసాగా మేడదిగి వస్తూ వీళ్ళందర్నీ చూసి పువ్వు దాచేస్తాడు. ప్రసాదం అందరికన్నా ముందర రామారావుని చూస్తాడు.]

ప్రసా : (ఉత్సాహంగా) బావోయి! ఇదుగో మేడమీంచి వచ్చారు!-మేడమీద ఎక్కడ దాక్కున్నారు?

ధన : (తెల్లబోయి) ఆ!-ఇంట్లోనే ఉన్నారూ? (హాయిగా నిట్టూర్చి) హమ్మయ్యా! ఎంతకంగారు పెట్టావయ్యా, మమల్ని? మేమిక్కడ ఛస్తూంటే, మీరు హాయిగా మేడమీద కూర్చున్నారూ?-అన్నట్లు, అసలు మేడెందుకెక్కారు? మీకేం పనండీ, అక్కడ?

రామా: మేడ చూడ్డానికెళ్ళాను.

ధన : ఎవర్నడిగి వెళ్ళారు? అక్కడ మా అమ్మాయి ఒక్కత్తే ఉంది. పరాయివాళ్ళు అమాంతంగా జొరబడి పోవడమే?

రామా: అంత కోపం ఎందుకండీ?-అందంగా ఉంటే చూద్దామని వెళ్ళాను!

ప్రసా : ఏమిటండీ?

రామా: మేడ!

ధన : అయినాసరే, మమ్మల్ని అడగాలి. ఇదేమన్నా మీ సొంతకొంపా? -(ప్రసాదం హాయిగా నిట్టూర్చి M. B. లోకి చక్కాపోతాడు.)

నారా : ఏం, రామం? (అని సాభిప్రాయంగా కళ్ళు మేడ వైపు తిప్పుతాడు.)

రామా: (ఉత్సాహంతో) ఆల్ రైట్! (అని రహస్యంగా పువ్వు చూపిస్తాడు.)

ధన : ఆల్ రైటేమిటి?-ముందు మీరివ్వవలసిన అయిదు వందలూ, నేను మీకు వ్రాసిన అవుత్తరం ఇల్లా పారేసి, మీవాణ్ణి తక్షణం తీసుకుపొండి!

నారా : అయితే మీ బస్తాల కథ మీరు మానరన్నమాట! సరే, ఇహనో ఇప్పుడో పోలీసులు వస్తారు. మీరు వ్రాసిన ఉత్తరం వాళ్ళ చేతుల్లో పారేస్తే, వాళ్ళే నిర్ణయిస్తారు, మీరు రావల్సింది అయిదువందల

రూపాయలో, అయిదు సంవత్సరాల జైలో! (అని విసురుగా కుర్చీలో కూచుంటాడు.)

ధన : మళ్ళీ పోలీసులూ, జైలూ అంటారేమిటండి, ఖర్మ! (బాధగా) ఎరక్కపోయి రాశాను ఆ ఉత్తరం. (కసిగా)ఇదిగో, ఈయనే కథలు రాస్తాడూ.కవిత్వం చెపుతాడు అంటే కంగారులో మతోయి చెప్పిందల్లా రాశాను! కొంప మునిగింది! నిజంగా చెప్పండి! మీరు అయిదు కిచిలీబస్తాలూ......

నారా : నాకు తెలియదు.

ధన : (తెల్లబోయి) ఆ!-ప్రమాణం చెయ్యండి!

నారా : అనుమానం ఉంటేగా ?

ధన : అయ్యో!-మొహం మీద అల్లా తెగేసి అబద్ద మాడతారేమిటండీ ?

నారా : (రామారావుతో) ఈపాటికి రావలసిందేనోయి పోలీసులు!

రామా: గోతుల కోడ్డుకదూ ?- అంచేత ఆలస్యం అవుతుంది.

ధన : (ఆదుర్దాగా ఇటూ అటూ చూసి) ఏమండీ ?- నారాయణరావుగారూ! పోనీ రెండురూపాయలు కొట్టేసుకుని, మిగతా ఉగువందల తొంభై ఎనిమిది రూపాయలు, నా కాగితం నాకు పారెయ్యండి, ఎందుకొచ్చిన గొడవ!

నారా : (టైము చూసుకుంటూ లేచి) ఇంకా ఆలస్యం చేస్తున్నా రేమిటో! నాకంటా ముందే బయల్దేరారు. జీపులో!

ధన : (హడిలిపోయి) జీపు కారులో నే!—(కంగారుగా) ఖర్మ. మరో పావలా కొట్టేసుగోండి—అయ్యో, అల్లా రోడ్డు కేసి దిక్కులు చూస్తా రేమిటండీ?

నారా : అబ్బ!—కాస్సేపు విసిగించకండి!—బస్తావందట!— ఏంకథ!

ధన : కథా?—సరే, మరో పావలా కొట్టేసుగుని, మిగతా నాలుగు వందల తొంభై ఏడున్నరా తగలెయ్యండి ఇంకెప్పుడూ బస్తా వంద చెప్పను!—(లెంపలు వాయించుగుని) సరేనా?—(డగ్గుత్తికంఠంతో) ముసలాణ్ణి మరీ ఇంతక్షోభ పెట్టడం మీకు న్యాయంకాదు!

రామా: (జాలిగా) పోనీవోయి గొడవ!— జాలేస్తోంది.

నారా : ఆయనమీద మధ్య నీకెందుకోయి జాలి? అమాయకపు రైతులికి అప్పులిచ్చి, చక్రవడ్డీలు కట్టి, వాళ్ళపొట్టకొట్టి, ఆస్తులు దోచుకొంటున్నప్పుడు, ఆ రైతుల ఏడుపు లేమన్నా ఈయన చెవిని పడ్డాయా? కాస్తేనా జాలిపడి, కానీఏనా వదలిపెట్టాడా? మన కెందుకోయి, ఈతంపి? ఆ పోలీసులొచ్చి చూసుకుంటారు!

ధన : (ఉడుకుమోత్తనం మితిమీరిపోగా) అయితే నా డబ్బు కాజేసి, పైగా నన్ను జైల్లో పారేయిస్తారా?– (ఏడుస్తూ) ఇంత అన్యాయమంటండీ ?

నారా : (ఏదో విన్నట్టు గబుక్కునలేచి) అదుగో, వచ్చినట్టున్నారు, పోలీసులు !

ధన : (హడలిపోయి, నారాయణరావు చేతులు పట్టుగుని) నారాయణరావుగారూ !– బాబ్బాబు !– ఇవి చేతులు కావు !

నారా : (ఒక్కక్షణం ఆలోచించినట్టు ఆగి) సరే !– మీరు ఇంతగా ప్రాధేయపడుతున్నారు గనక, ఓపని చెయ్యండి !– మీఉత్తరం వెనక్కొస్తుంది, మీ డబ్బూ మీకు దక్కుతుంది !

ధన : (నమ్మలేనట్టు చూస్తూ) నాడబ్బే !– చెప్పండి, ఏం చెయ్యమన్నా చేస్తాను !

నారా : మాట తప్పితే ?

ధన : దేముడుమీాద ఒట్టు !

నారా : అయితే వినండి ! మీరు రాసిన. ఉత్తరం; అణా పైసల్తో మీకు రావలిసిన డబ్బు ఇచ్చేస్తాను. ముందు రామారావుని మీ అల్లుడిగా చేసుగోండి, అంతే !

ధన : (తెల్లపోయి) ఏమిటీ ?– అల్లుడా ! ! (అని బాధగా చూస్తూ తల అడ్డంగా ఆడిస్తూ ఏంతోచక వెనక్కి

అడుగువేస్తాడు. L. F. అవతలనుంచి "ధనరాజూ–! ధనరాజు !" అని కేకలు వినిపిస్తాయి. ధనరాజు బిగుసుకుపోయి వింటాడు.)

నారా : అడుగో పోలీసులుకూడా వచ్చినట్టున్నారు ! లోప లికి రమ్మనవోయి, కాగితం ఇచ్చేద్దాం. అయిదా రేళ్ళు జైల్లో కూచుంటేనేగాని ఈజలుబుకుదరదు ! (రామారావు L. F. కేసి నడుస్తాడు.)

ధన : (నారాయణరావు రెండుచేతులూ పట్టుగుని) నారా యణరావుగారూ !

నారా : చెప్పానుకదండీ ! (రామారావు L. F. దగ్గిర ఆగు తాడు.)

ధన : ఖర్మ ! కులము గోత్రమూ తెలియకుండా కూతుర్ని ఎల్లా కట్టబెట్టనయ్యా ?

నారా : వెనక వచ్చినవాళ్ళ సంగతులు తవ్వుకునేబదులు, ఎదురుగుండా ఉన్న మనిషినిచూసి నిర్ణయించు గోడం మంచిది !

(L. F. లోంచి గట్టిగా "ధనరాజూ !- ధనరాజు !" అని అరుపులు తలుపుమీద కర్రతో కొట్టినట్టు చప్పుళ్ళు వినిపిస్తాయి.)

చెవ : (R. F. లోంచి వచ్చి L. F. కేసి నడుస్తూ) ఓరదీ ?- ఓమూల్నించి ఒత్తూంటూనే కాకల్లా అరుత్తారేం ? (అంటూ L. F. లోకి తిన్నగా వెళ్ళి పోతాడు. నారాయణరావు, రామారావు తాపీగా

నిలబడతారు. ధనరాజు ఏక్షణమైనా పేలిపోడానికి సిద్ధంగాఉన్న రబ్బరుబుడగలా చూస్తూ నిలబడి పోతాడు. చెవలయ్య L. F. లోంచి కంగారుగావచ్చి)
అయ్యగారూ !– పోలీసు లొచ్చారు !

ధన : (ఒక్క-దూకులో నారాయణరావు దగ్గిర కెళ్ళి) నారాయణరావుగారూ ! నేను ఒప్పుగుంటానుగాని, ముందు ఆ యములాళ్ళని పంపించెయ్యండి !

నారా : రామం !– ఓ అయిదు నిమిషాలు ఆగమని చెప్పు !
(రామారావు L. F. లోకి వెడతాడు)

ధన : (నిట్టూర్చి) ఏమండీ ?– పెళ్ళికి ఒప్పుగుంటే, నా డబ్బూ, నేను రాసిన కాగితం నాకు పారేస్తారా ? ఇంక జన్మలో ఎవ్వరికీ అరు వివ్వను !

నారా : అల్లానేగాని, పెళ్ళిప్పుడు అయిపోవాలి !

ధన : అంత నిమిషాలమీద ఎల్లాగండీ?– ఉన్నది ఒక్క-గానొక్క- కూతురు ! కాస్త ముద్దూ ముచ్చటా తీరాలా ?– ఈవేళ పురోహితుడి దగ్గర కెళ్ళి ముహూర్తం పెట్టించుకొస్తాను. సరేనా ?

నారా : అయితేముందిప్పుడు ప్రధానం చెయ్యండి. డబ్బంతా ఇచ్చేస్తాను ! పెళ్ళవగానే కాగితం ఇచ్చేస్తాను.

ధన : అదేమిటండీ మరీను ! నామాటమీద ఆమాత్రం నమ్మకంలేదు, మీకూ ?

[రామారావు L. F. లోంచి వస్తాడు]

నారా : మాటల్నీ నమ్ముకుని ముందు కెడితే సాధారణంగా మాటలే మిగుల్తాయి! ముందు ప్రధానం చెయ్యండి. డబ్బిదిగో! (అంటూ పర్సుతీసి అయిదు వందల రూపాయల నోట్లు తీస్తాడు.)

ధన : (కళ్ళు మిటకరించి చూస్తూ) ఎంత ?

నారా : అయిదువందలు!– మీరు కోరిన ధనం. చేతులో తిరిగే పచ్చనోట్లు, చంద్రుళ్ళాంటి పెళ్ళికొడుకు! ఊఁ అనండి, మీ వయి పోతాయి!

(ధనరాజు డబ్బుని ఆరాధనతో చూసి, నిట్టూర్చి. తలపంకించి R.F. కేసి తిరుగుతాడు.)

ధన : చెవలయ్యా!

చెవ : ఏం బాబయ్యా!

ధన : ప్రసాదం ఏం చేస్తున్నాడు!

చెవ : నీళ్ళోసుగుంటున్నారండి.

(ధనరాజు నోట్లకేసి మరోసారి చూసి మేడపైకి వెడతాడు.)

రామా: చెవలయ్యా!– కొంచెం మంచినీళ్ళు తెచ్చిపెట్టు! (చెవలయ్య R F. లోకి వెడతాడు.) నారాయణ రావు! వాళ్ళు మీ దివాణంలో జవాన్లలా ఉన్నారేమిటోయి ?

నారా : లా ఉండడ మేమిటీ ? వాళ్ళే!– ఇప్పుడు పోలీసులు ఎక్కడ దొరుకుతారు మనకీ ? అది సరేగాని, ఆల్ రైటనేశావు, ఆవిడ అంగీకారం పుచ్చుకున్నావా ?

రామా: పూర్తిగానూ!- చెట్టంత జమీందారు మనకి సాయం ఉన్నాడని కూడా చెప్పాను.

నారా : అంతేలే! అవసరం తీరాక అంతా చెట్లూ చేమ ల్లాగే కనిపిస్తారు.

[మేడమీంచి ధనరాజు, శాంత వస్తారు. R. F. లోంచి చెవలయ్య ఓ గ్లాసుతో నీళ్ళు తీసుకుని వస్తాడు.]

రామా: అక్కర్లేదులే! (చెవలయ్య అదోలా చూసి బల్ల మీద గ్లాసు పెట్టేస్తాడు)

ధన : రామారావుగారూ!- నా తల్లిని అల్లారు ముద్దుగా పెంచాను. (గద్గద కంఠంతో) తల్లి లేని పిల్ల!-శుద్ధ అమాయకురాలు!- నా పిల్లనీ పిల్లతో పాటు నా ప్రాణాల్నీ మీ చేతుల్లో పెడుతున్నాను - (అంటూ చేతులు కలిపి) ఎల్లా చూసుకుంటారో, ఏమిటో!-(కళ్ళు నీళ్ళు తుడుచుకుంటాడు)

(చెవలయ్య ఉత్సాహంతో M. B. లోకి పరిగెడతాడు)

రామా: అధైర్యపడకండి!- ప్రాణంకంటే ప్రాణంగా చూసుకుంటాననీ ప్రమాణం చేస్తున్నాను. (చేతులు వది లేస్తారు)

ధన : నారాయణరావుగారూ! ఈ పెళ్ళి మీరు చేయిస్తున్నారు. బాధ్యత అంతా మీదే!

నారా : తప్పకుండాను!- అల్లానుంచుంటా వేమిటోయి? మామగారికి నమస్కారం చెయ్యి! (రామారావు, శాంతా, చిరునవ్వుతో ధనరాజుకి నమస్కరిస్తారు)

(చెవలయ్య M B. లోంచి పరుగులోవచ్చి ధనరాజు చేతిలో అక్షింతలు పోస్తాడు)

ధన : (విసుగ్గా) ఇదేమిట్రా!

చెవ : అచ్చింతలు, బాబయ్యా!– ఎయ్యండి?

నారా: నౌఖరంటే అల్లాఉండాలి! దీవించండి, ధనరాజు గారూ!

ధన : (చెవలయ్యని తినేసేలా చూసి, నవ్వు తెచ్చిపెట్టుకుని శాంత తలమీద మాత్రం అక్షింతలు వేసి) అమ్మాయి!–ఇంక నువ్వు లోపలికెళ్ళమ్మా!

(శాంత, రామారావుకేసి సిగ్గుపడుతూ చూసి కొద్దిగా నవ్వి M. B. లోకి వెళ్ళిపోతుంది)

నారా : ఇదుగో, మీ డబ్బు! (ధనరాజు సంతోషంతో అందుకుని, కళ్ళకద్దుకుని లెక్కపెట్టుకుంటూంటాడు.) అన్నీ సరిగ్గా ఉన్నాయాండీ?

(చెవలయ్య M. B. లోకి వెడతాడు)

ధన : చిత్తం! కాని వీరు హోమీకింద ఉన్నప్పుడు, ఆయన భోజనానికీ టిఫిన్లకీ తలంట్లకీ వగైరాలకి పది హేనురూపాయలు దాకా కర్చయింది. మరి దాని మాటేమిటి?

నారా : (తెల్లబోయి) అయ్యో, మీ ఇల్లు బంగారంగానూ! ఇప్పుడతను మీ అల్లుడే కదండీ?

ధన : (వ్యవహారఫక్కీలో నవ్వి) అవుననుకోండి!– కాని నేను చెబుతున్నది అంతకి ముందుమాట కదండీ?– అంచేత అది వ్యాపారం ఖర్చే! ఇప్పించండి!

నారా : ధనరాజుగారూ! చివరికి మీ నైజంమాత్రం పోనిచ్చు కున్నారు కాదు!- సరేలే, తీసుకోండి! (ఇచ్చి) మరి పెళ్ళెప్పుడు చేస్తారు?

ధన : (డబ్బు పుచ్చుకుంటూ, హాయిగా నవ్వి) ఇదుగో, మధ్యాహ్నం పురోహితుడి దగ్గరకెళ్ళి ముహూర్తం పెట్టించుకొస్తాను.

నారా : అయితే సాయంత్రం మళ్ళీ రామారావుని ఓసారి పంపిస్తాను.

ధన : ఎందుకండీ, ఖర్మ!- నేను కబురంపిస్తానుగా?

నారా : సరే!- భోగారావు ఇంటికి కబురు పంపించండి, వస్తాం!

ధన : వెళ్ళిరండి, బాబూ!- పెళ్ళినాటికి మీనాన్నగార్ని కుటుంబాన్ని అందర్నీ తీసుకురావాలు సుమాండీ?- మీరు చేయిస్తున్న పెళ్ళే ఇది!

నారా : అల్లానే! నమస్కారం!

ధన : నమస్కారం!

రామా: (ఉత్సాహంగా) నమస్కారమండీ!

ధన : మంచిది, నాయనా!- వెళ్ళిరా!

[రామారావు,నారాయణరావూ L.F లోకి వెడతారు ధనరాజు తలపంకించి, గుండెలమీద చెయ్యేసుకుని, హాయిగానిట్టూర్చి, L.F. లోకి వెళ్ళి ఒక్క క్షణం ఆగి మళ్ళీ వస్తాడు.] ప్రసాదం!—ప్రసాదం!

ప్రసా : (RF లోంచి వస్తూ) ఏం బావా ?

ధన : ఇంతసేపూ నీళ్ళోసుగోడ మేరా ?

ప్రసా : నీళ్ళు ఇందాకానే పోసుగున్నాను, బావా !- పోసు గుని...

ధన : మళ్ళీ పేకాడుతున్నావా ?

ప్రసా : (హడిలిపోయి) నీకెల్లా తెలుసు ?

ధన : తెలివి తెల్లారినట్టే ఉందిగాని, చెప్పింది జాగ్రత్తగా విను !

ప్రసా : (తల ఊపి, అటూ ఇటూ చూసి) అన్నట్లు బావా! వీళ్ళంతా ఎరీ ?

ధన : అబ్బ !-వినరా !-అమ్మాయి అందంగా ఉందీ, పైగా బోల్డుఆస్తి ఉందీ అని పసిగట్టి ఎగరేసుగుపోదామని వచ్చిన రౌడీల్రా వీళ్ళు !

ప్రసా : అబ్బా, సిన్నే ?

ధన : నీమొహం !-నన్ను కాదు, శాంతని !

ప్రసా : (తెల్లబోయి) శాంతనా ?

ధన : మరేమనుకున్నావు ? వాళ్ళని వొదిలిపించుగుని క్షేమంగా బయట పడ్డాటప్పడికి నాతల ప్రాణం తోకొచ్చింది. అసలు మరోడయితే జైలుకి పోవలిసిందే !

ప్రసా : బాబో, జైలే!- బావా !- జైల్లో పేకాడుకో నిస్తారా ?

ధన : చావకొట్టి చెవులుమూస్తారు, ఖర్మ! అది సరేగాని ఈ రౌడీ లున్నారే వీళ్ళు సామాన్యులు కారు. మళ్ళీ ఏంకుట్రలు పన్నుతారో ఏమిటో! అంచేత శాంతని, నీకిచ్చి ఈవాళరాత్రే పెళ్ళి చేసేస్తాను, తీరిపోతుంది!

ప్రసా : (ఆశ్చర్యంగా, ఆనందంగా) ఏమిటీ?– శాంతకీ నాకూ పెళ్ళా?—భలే, భలే!

ధన : నువ్వు ఆట్టే ఎగిరి అల్లరిచెయ్యకు. ఈపెళ్ళి గప్‌చిప్‌గా జరిగిపోవాలి. తెలిసిందా? (ప్రసాదం నోరు మూసుగుని తల ఆడిస్తాడు.) చెవలయ్యా! చెవలయ్యా!

చెవ : (MB లోంచి వస్తూ) ఏటి, బాబయ్యా!—

ధన : ఇల్లారా!– ప్రసాదానికీ, శాంతకీ ఈరాత్రేపెళ్ళి!

చెవ : (ఆశ్చర్యంగా) ఓరోరికీ?

ధన : ప్రసాదానికీ, శాంతకీరా! అరేంజిమెంట్లన్నీ టకటకా జరిగిపోవాలి!

చెవ : అదేటండీ?–మరి ఇందాకా!—

ధన : (కోపంగా) ఖర్మ, నువ్వు నోరుముయ్యరా!— ప్రసాదం! నువ్వు చెవలయ్యతో బజారుకెళ్ళి, నీకు ఓజత పట్టుబట్టలూ, శాంతకి ఓ పట్టుచీర, మంచి రవికలగుడ్డ, రెండు సాదాచీరలూ, నాకు నాలుగు చాపులూ నీకాతాలో పద్దురాయించి తీసుగురా!

ప్రసా : నీకూ్కడా ఎందుకూ కొత్త బట్టలూ ?

ధన : (చిలిపిగా నవ్వి) పెళ్ళికూతురు తండ్రిని కదురా, అందుకని! అసలు పురోహితుణ్ణి కనుక్కుంటే ఆరు తెమ్మంటాడు. నువ్వు కనక నాలుగని చెప్పాను- వచ్చేటప్పుడు సుబ్బయ్య కొట్టుమీద తలో శేరు అపరాలు కూడా పట్రా !- మిగతావన్నీ నేను తెస్తానులే !

ప్రసా : ఇంకా మిగతావి ఏ మున్నాయి ? కొబ్బరి బొండా మేగా ?- అదీ తెస్తాను. రారా, చెవలయ్య !

(ప్రసాదం హుషారుగాను, చెవలయ్య తెల్లబోతూను L. F. లోకి వెడతారు ధనరాజు హాయిగా నవ్వుతాడు.)

ధన : తుక్కు-కాగితం ఓటి పుచ్చుగుని, నన్నే పడగొడదా మనుకున్నారు, ఈ కుఱ్ఱకుంకలు ! ధనరాజంటే ఏమిటో రేపు తెలుస్తుంది. (మళ్ళీనవ్వి) ఈపెళ్ళి చేసి ప్రసాదం రెండులక్షల ఆస్తి చేజిక్కించు కోవాలి !- (కులుకుతూ) అప్పుడుగాని ఈపొట్ట మన స్సుకి తృప్తి ఉండదు ! (అని మళ్ళీనవ్వి, కుర్చీలో తీరిగ్గాకూచుని, కూనిరాగంతీసి, M. B. వైపు చూసి) అమ్మాయి !- శాంతా !- కాసిని మంచి నీళ్ళు తెచ్చిపెట్టమ్మా ! (అని మళ్ళీ కూనిరాగం తీస్తూంటాడు.)

(శాంత M. B లోంచి గ్లాసతో నీళ్ళు తీసుకు వస్తుంది. మొహం చేవురించి నట్టుంటుంది. కళ్ళమ్మట నీళ్ళు కారుతూంటాయి. గ్లాసు పుచ్చుకుందుకు ధనరాజు శాంతవైపు ఆనందంతో చూసి, కన్నీళ్ళు తుడుచుగుంటున్న శాంతని ఆశ్చర్యంతో పరికిస్తాడు. శాంత తల తిప్పుగుంటుంది.)

ధన : అదేమిటి, శాంతా!-ఏడుస్తున్నా వెందుకు? (పుచ్చుగున్న గ్లాసు పక్కన పెట్టి) ఈ శుభసమయంలో అమ్మ లేదనా? ఏంచేస్తాం? - ఋణం లేదు, అంతే!

శాంత : (తటపటాయించి, మెల్లిగా) అది కాదు నాన్నా!

ధన : మరేమిటి!?- చెప్పమ్మా! (లేస్తూ) నాన్నని నేనున్నాగా?-చెప్పు!

శాంత : మొహం తిప్పుగుని, ఆవేశంతో) మావయ్యతో పెళ్ళి నాకిష్టంలేదు, నాన్నా!

ధన : (దెబ్బ తిన్నట్టు చూస్తూ) ఏమన్నావు? ఇష్టం లేదూ? - నిక్షేపంలాంటి సంబంధం చచ్చీచెడి కుదురుస్తే. ఇష్టం లేదట! తలకిందులుగా తపస్సు చేస్తే దొరుకుతుందిటే రెండు లక్షల ఆస్తి?-పైగా మనిషి మంచివాడు, మనవాడు!- ప్రసాదానికి ఏమిటే లోటు?

శాంత : (తల దించుగుని, ఏడుపు ఆపుగుంటూ) నీకు తెలీదా, నాన్నా?

ధన : (కాస్త తబ్బిబ్బుపడి) చాల్లెద్దూ, చెప్పొచ్చావ్! తెలివితేటలేమన్నా కొరుక్కుతింటామా?-అయినా ఈ సంబంధం మీ అమ్మ కోరుకుంది, నాకూ నచ్చింది, ఆ!- అంతా ఆలోచించే స్థిరపరిచాను.

శాంత : (బాధగా) నన్నేమీ అడగక్కర్లేదా?— (రుద్ధ కంఠంతో) అమ్మ ఉంటే ఇల్లా చేస్తుందా?

ధన : (విసుగ్గా) ఉన్న నాన్నని ఇంత గౌరవించావు, ఇంక లేని అమ్మగురించి కలవరిస్తా వెందుకు?— ఏమిటట గాలే నిన్ను?— 'ఈపెళ్ళి నీకిష్టమేనా?' అని కుఱ్ఱ పిల్లవి నిన్ను కనుక్కోవాలా, నేను?— ఇంక పెద్ద వాళ్ళం బతికిఉండి లాభం ఏమిటి?— పైగా నీకంటె చెప్పలేదుగాని, ఈసంబంధం చెయ్యాలని మీ అమ్మా నేనూ ఎప్పుడో నిశ్చయించుకున్నాం.

శాంత : (రోషంతో) అయితే ఇందాకా ఆ ప్రధానం ఎందుకు చేశావు?

ధన : అదా నీబాధ! (కొంచెం నవ్వి) అదంతా ఉత్త నాటకమే!— డబ్బు లాగడానికి, అంతే!

శాంత : (నమ్మలేనట్టు చూస్తూ) డబ్బుకోసం జీవితాల్తో నాటక మాడతారా?

ధన : ఏమొచ్చిం దిప్పుడు? ఖర్మ, అదంతా అబద్ధమే!

శాంత : అల్లా జరగనే లేదంటావా?

ధన : (చూపు తప్పించుకుని) జరిగిం దనుకో!

శాంత : అనుకోవడ మేమిటి, నాన్నా!— ఇంట్లో ఉన్న దాన్ని బయటికి పిల్చావు పిల్చి మాచేతులు కలిపావు. కలిపి మమ్మల్ని ఆశీర్వదించావు! (ఏడుస్తూ) ఇంకా పెళ్ళంటూ వేరే అవ్వాలా! ఈ జీవితానికి ఆయనే నాకు భర్త!— ఆయన్నే నేను మనసారా ప్రేమిస్తున్నాను!

ధన : (తెల్లబోయి ఒక్క-క్షణం నిలబడిపోయి) ప్రేమిస్తున్నావు? (ఆవేశంతో) ఆస్తిపాస్తులులేని అభాగ్యుణ్ణి కట్టుగుని ఏంసుఖం అనుభవించగలవు, శాంతా!- కడుపులో రగిలే ఆకలి, కళ్ళల్లో మెరిసే ప్రేమని, మూడు నిమిషాల్లో మటుమాయం చేస్తుంది, తెలుసా? కట్టుబుద్ధితో వెట్టిఆలోచనలు చెయ్యక చెప్పినట్లు విను!

శాంత : (ఆవేశంతో ఏడుస్తూ) జీవితంలో ఇంతవరకూ ఎప్పుడూ నీమాటకి ఎదురాడలేదు. ఇంక జీవితాంతం వరకూ నీమాట వేదంలా పాటిస్తానని నీ కాళ్లు పట్టుగు ప్రమాణం చేస్తున్నాను. (కాళ్ళుపట్టుగుని ఏడుస్తుంది) ఈ ఒక్క-సారీ మన్నించు, నాన్నా!

ధన : (తప్పించుగుని, వెనక్కి-వెళ్ళి) చాలు చాలు! నువ్విల్లా తయారవుతావనుకోలేదు, శాంతా!- అనవసరంగా బాధపడక అదంతా మరిచిపో! డబ్బుకోసం లక్ష అంటాం, అవన్నీ జరుపుతామా?

శాంత : (అసహ్యంతో, ఆశ్చర్యంతో, రోషంతో వెనక్కి-నడిచిన శాంత ఆవేశపడుతూ ఉధ్రముతున్నట్టు చూస్తుంది) నీ డబ్బుకోసం నాజీవితం నాశనం చేస్తావా, నాన్నా?

ధన : (విసుగ్గా, కోపంగా) శాంతా!

శాంత : (ఏడుస్తూ) కోపం ఎందుకు? నీఆలోచన నాకు తెలుసు, నాన్నా! ప్రసాదానికి నన్ను ఎరచూపెట్టి,

రెండులక్షల ఆ స్త్రీ నీచేతులో పడగానే అతణ్ణి వీధులోకి గెంటుతావు!– నాబతుకే నరకంచేసి నవ్వుతూ నువ్వు డబ్బు లెక్కెట్టుకుంటావు!

ధన : (కోపం పట్టలేక మీదికి వెడుతూ) నోర్మూయి!

శాంత : (మతిపోయినట్లు చూస్తూ) ఆతరవాత– ఆతరవాత నాకూడా ఇంత విషంపెట్టు!– నే ఛస్తే నీకు నా తిండిఖర్చుకూడా మిగుల్తుంది!

ధన : శాంతా! (అని గట్టిగా అరిచి, ఉగ్రుడైపోయి, పశుకోపంతో శాంత చెంపమీద సాచికొడతాడు.)

శాంత : (బెదిరిపోయి) నాన్నా!– (అని వెఱ్ఱిగా అరిచి, ఏడుస్తూ తండ్రిని చూసి) నాన్నా!– (అని వొణుకుతూ పలికి, చేత్తో నోరుమూసుగుని పెద్దపెట్టున ఏడ్చేస్తుంది.)

ధన : (శాంత చెంపకేసీ, వొణుకుతున్న తన చేతికేసి వెఱ్ఱివాడిలా చూసుగుని, పొంగి పొరలే దుఃఖంతో శాంతని దగ్గరకు తీసుగుంటూ) అమ్మా, శాంతా! పాపిష్టివాణ్ణి!– ఎంత దెబ్బ కొట్టానమ్మా, నిన్ను! ఏడవకు తల్లీ, ఏడవకు!– ఎందుకమ్మా అంతమాటన్నావు? నీకూ అంత నీచుడిగా కనిపిస్తున్నానా?– నిన్ను సుఖపెట్టాలనే కదుటే, ఇన్ని అవస్థలూ పడి సంపాదిస్తున్నాను? నీకంటె నాకు ఇంకెవరున్నారు, చెప్పు!...నీకెక్కడ కష్టం కలుగుతుందోనని, అన్ని

సుఖాలు విడిచి, అష్టకష్టాలూ భరించి ఇల్లాలు ముద్దుగా పెంచానే. నిన్ను...అందుకు ఫలితంగా నన్నింతమాట అనేస్తావా, శాంతా ?

శాంత : (తండ్రి బాధచూసి, ఆగలేక) క్షమించు నాన్నా!- ఆవేశంలో అనేశాను.

ధన : ఆవేశం కాదమ్మా, అది అజ్ఞానం!- ప్రపంచం పోకడలు నీకేం తెలుస్తాయి ? డబ్బు చేసుకునే మనిషిని చూసి ఈ ప్రజలు లోభి రాక్షసుడు అని పేర్లెడతారు. డబ్బు చెడ్డదని ప్రచారం చేస్తారు. ఎందుకోసమో తెలుసా?- డబ్బు వాళ్ళకి అక్కర్లేక కాదు. డబ్బుమీద అసహ్యం ఉండీ కాదు- పక్కవాళ్ళు పోగుచేసు కుంటున్నారనే ఈర్ష్యకొద్దీ లోపల కుళ్ళుతూ, పైకి అల్లా అనడం పరిపాటయిపోయింది. కాకపోతే, డబ్బు లేని మనిషిని చూసి ఈ ప్రజలే కుక్క, అన్నట్టు కసిరేస్తారేం? కుష్ఠురోగిని చూసి నట్లు చీదరించు కుంటారేం?- నామాట నమ్మ శాంతా!-ప్రతి మానవుడి జీవితగమనానికి డబ్బు ఒక ముఖ్యాధారం. కాదని బతిగే మనిషిని చూపెట్టు !

శాంత : అందుకని డబ్బుకోసం నీతినియమాలు వదిలేస్తామా, నాన్నా ?

ధన : (వెటకారంగా నవ్వి) నీతినియమాలు!- హు!-నీతి నియమాల్లు సంపాదించలేని సన్యాసులు బతగడానికి

పెట్టుకున్న నికృష్టపుగోడలు ! (గుండెలమీాద ఆవేశంతో కొట్టుగుంటూ) డబ్బుకున్న విలువ అది లేక బాధపడ్డవాడికి, బాధపడి ఆర్జించినవాడికీ, నాకు తెలుసు, శాంతా!- డబ్బులోనే పుట్టి, డబ్బులోనే పెరిగావుకాబట్టి, దారిద్ర్యంలో ఉండే దుర్భరత్వం, నీచత్వం నీకెల్లా తెలుస్తాయి ? అతన్నే కోరుకుంటే అన్ని సుఖాలూ విడిచి, కట్టుగుడ్డల్తో బయటికి నడవవలిసి వస్తుంది ఆ తరువాత నువ్వే కడుపు కాల్తోందని గోలెత్తినా కులంలేని మీాకు, ఈ సంఘం పిడికెడు అన్నంకాదు, ఒక్క రాగికానీ కూడా దొరకనియ్యాదు, తెలుసా? అప్పుడీ రామారావు అందం, తెలివీ నీ ఆకల్ని తీరుస్తా యనుకుంటున్నావా ?

శాంత : అయినాసరే, నాన్నా !

ధన : (ఆదుర్దాగా చూస్తూ) ఆ !- అంత మూర్ఖత్వం పనికిరాదు, శాంతా! ముంచుగొస్తున్నా మూర్ఖత్వం ముందు వెనుకలు చూడనియ్యదు. నిదానంగా ఆలోచించు!- కట్టుగుడ్డల్తో ఇంటినుంచి కదుల్తున్నావని తెలుస్తె ఈ రామారావు నీ ఛాయలకి వస్తాడని చూస్తున్నావా? అసలు నిన్ను కన్నెత్తి కూడా గుర్తించడు. అతన్ని ఆకర్షించింది, నీ అందంకాదు. మన డబ్బు!- అతను ప్రేమించింది నిన్నుకాదు. నీకు వస్తుందనుకుంటున్న నాడబ్బుని !

శాంత : కాదునాన్నా!- ఆయన అటువంటివారుకాదు !

ధన : (తెల్లబోయి) హుఁ!- నానాఅవస్థలూ పడి, ఇన్నాళ్ళూ పెంచిన తండ్రిని ఈమాత్రం అర్థం చేసుకున్న నువ్వు, ముక్కూ- మొహమూ ఎరగని ఆ మనిషిని ఒక్కరోజులో అంతఅర్థం చేసుకోగలిగావా? పొరబడుతున్నావు, శాంతా!- శాంతా! నామాట విను! నాకోసమైనా విను, శాంతా! (ఓడిపోతున్న రోషంతో) తండ్రిమాట తిరస్కరించి తిరిగితే అది మాత్రం నీకు శ్రేయస్సా!

శాంత : (బాధగా) నాన్నా!-

ధన : (ఆవేశంతో) అవునులే!- బతుకంతా స్వార్థంతో నడిపానో, నీకోసం గడిపానో ఆపరమాత్ముడికే తెలుసు!- (దుఃఖానికి లొంగిపోతూ) నాకూ వృద్ధాప్యం వచ్చింది. బతికి నన్నాళ్లూ బతకను. ఇంక నా సాయం నీకక్కర్లేదుగదా అని-నామాట కొట్టేసి- (ఏడ్చేస్తూ) ఈ ముసిలితనంలో నాఖర్మకి నన్నొదిలేసి, వెళ్ళిపోతావా, శాంతా!

శాంత : (అపరాధిలా చూస్తూ, ఏడుస్తూ, తండ్రి దగ్గిరకి పరిగెత్తుకెడుతూ) నాన్నా!- అంతమాట అనకు నాన్నా!

ధన : (శాంత దగ్గిర్నించి తప్పుకుని. ఆవేశంతో) వెళ్ళమ్మా, వెళ్ళు!- ఇంత స్వార్థపరురాలవవుతావని గ్రహించు

గో లేకపోయాను. (తలపట్టుగుని) ఖర్మ !- పాలుపోసి పాముని పెంచాను !

శాంత : నాన్నా !-

ధన : (విపరీతంగా బాధపడుతూ, ఆవేశంతో) నాన్న దుష్టుడు, నవ్వినవాడు ఇష్టుడు అనిపించినప్పుడే కన్నె పిల్లకి అనోగతి ఆరంభమవుతుంది. పుట్టగానే తల్లిని పొట్టనెట్టుగున్నావు. కాని-(గుండెలు కొట్టుకుంటూ) నన్ను మింగినా-తీరిపోయేది-ఈదురవస్థ!- తప్పిపోయేది !-(గుండెలు గబుక్కుని నొక్కిపట్టిగుని) అమ్మా !. (అంటూ నేలమీదికి కుంగిపోతాడు.)

శాంత : (భయంతో, వెఱ్ఱిగా) నాన్నా !-(అని అరిచి, ధనరాజుని కుర్చీలో కూచోబెట్టి) నాన్నా ! ఆవేశపడకు నాన్నా! అసలే నీ గుండె మంచిదికాదు! (అని ఆదుర్దాగాతిరిగి, మందుసీసా, మందు గ్లాసు తీసుకువచ్చి మందు గ్లాసులో పోసిందు పోస్తుంది.)

ధన : అయిపోయింది !

శాంత : (హడలిపోయి) నాన్నా !

ధన : కొడుకైనా, కూతురైనా నువ్వే అని ఆశపడ్డాను. సరేలే !- జన్మకి సరిపోయే పాఠం చెప్పావుగా !

శాంత : (దుఖంతో) ఇప్పుడెందుకు నాన్నా. అవంతా ?- ముందు మందు తీసుకో !

ధన : (నిరాశతో) ఎవరికోసం ?

శాంత : (భయంతో) అదేమిటి, నాన్నా !

ధన : ఇంకా ఎందుకే నేను బతగడం ?–వొద్దు !–(అంటూ ముంచుకొస్తున్న దగ్గుకి లొంగిపోయి) అమ్మా !

శాంత : (కంగారుగా తండ్రిని పట్టుగుని ఇటూ అటూ చూసి ఏడుస్తూ, పిచ్చిగా) చెవలయ్యా !–మావయ్యా !– మావయ్యా!–(తిరిగి తండ్రిని కుర్చీలో సరిగ్గా కూర్చోపెట్టి) నాన్నా !– ఈ మందు తాగు !_ నాన్నా ?– నీమాట వింటాను, నాన్నా ! (ఏడ్చేస్తూ) అమ్మ–మీద ఒట్టు !– నువ్వు చెప్పినట్లు చేస్తాను, నాన్నా!– నాన్నా !–

ధన : (నమ్మలేనట్టు చూస్తూ, ఆనంద తో) ఆ !–

శాంత : ఆవేశపడకు నాన్నా !–మందు తీసుగో ! (ధనరాజు వెఱ్ఱివాడిలా చూస్తూ మందు తీసుగుని, బరువుగా నిట్టూర్చి వెనక్కి జేర్లబడతాడు. శాంత ధనరాజు గుండెలు రాస్తుంది)

ధన : (ఓ క్షణం ఆగి) హమ్మయ్య !– శాంతా !– నువ్వు నామాట వింటావని నా కెప్పుడూ నమ్మకమే ! (అని మెల్లిగా లేస్తాడు.)

శాంత : లేవకు, నాన్నా !–

ధన : ఫరవాలేదమ్మా!- నీ మాటతో వెయ్యి ఏనుగుల బలం వచ్చినట్లుంది. ఆలస్యం అమృతం విషం అన్నారు. ప్రసాదానికీ, నీకూ ఈ రాత్రే పెళ్ళి జరిగేలా ముహూర్తం పెట్టించుకొస్తాను! (శాంత బాధతో మొహం తిప్పుకుంటుంది.) శాంతా?- వెళ్ళిరానా? (శాంత ఏడుస్తూ తల ఊపుతుంది) మా బంగారుతల్లి!

(ధనరాజు చిరునవ్వుతో, అలిసినట్టు తూలుకుంటూ L. F. లోకి వెళ్ళిపోతాడు. ధనరాజు వెళ్లిన మార్గంకేసి శాంత నీళ్ళు నిండిన కళ్ళతో చూస్తూ, ఆవేదనతో వెనక్కి తిరిగి "అమ్మా!-" అని పెద్దపెట్టున ఏడుస్తూ హాలు మధ్యగా కుప్పలా కూలిపోతుంది.)

(తెర)

## రంగం-4

[ధనరాజు ఇంట్లో అదేహాలు. చెవలయ్య M. B. లో ఉన్న గుమ్మానికి మామిడితోరణం కడుతూంటాడు. ధనరాజు ఓ పట్టుపంచ కట్టుగుని, పట్టుకండువా జమాయించి ఉత్సాహంతో L. F. లోంచి వస్తాడు]

ధన : ఏరా చెవలయ్యా!– ఇంకా ఇవన్నీ కడుతూ వున్నావా? త్వరగా కానీ! ముహూర్తానికి ఇంక గంటే వుంది!

చెవ : సిత్తం! అయిపోయిందండి. (కాస్త తటపటాయించి) బాబయ్యా!—

ధన : ఏరా?

చెవ : సిన్న మాట సెప్పమంటారా?

ధన : ఏమిటిరా ఆమాట?

చెవ : అమ్మాయిగోరు ఇందాకణ్నుంచి కంటికీ మంటికీ ఏకదారగా ఏడుత్తున్నారండి. ఆయమ్మ ఏడుపు సూత్తూంటే నా కడుపు తరుక్కుపోతావుంది!

ధన : ఏంచెయ్యనురా, ఖర్మ! మరీ మాట వినకపోతే చావనా? చిట్టితల్లిమీద ఎప్పుడూ లేంది, ఈవాళ చెయ్యి చేసుగోవలి సొచ్చింది.

చెవ : ఎంతపని సేశారు, బాబయ్యా! తల్లిలేని పిల్లని కొడతారా? ఇంత ఇట్టంలేని పెళ్ళి సెయ్యడం మంచిది కాదండి!

ధన : (విసుగ్గా) ఆహా! తమరు అట్టే వాగడం కూడా మంచిది కాదండి! నోరుమూసుగుని పనిచూసుగో!

ప్రసా : (M.P. లోంచి వస్తూ) బాబూ! బాజాలింకా రాలేదేం ?

ధన : బాజాలేమిట్రా, ఖర్మ! భజంత్రీలురా!

ప్రసా : అవే, అవే!—రాలేదేం ?

ధన : వస్తాయిగాని, ఒరేయి ప్రసాదం! ముహూర్తానికి ఇంకా గంటే టైముంది. నువ్వీ లోపల మళ్ళీ ఎక్కడికీ తిరక్కు. ఒకవేళ ఇక్కడికి ఎవరేనా వస్తే 'నాకు పెళ్ళి పెళ్ళంటూ' నువ్వేమీ హడావుడి మొదలెట్టకు!

ప్రసా : ఏం, చెప్పకూడదా ?

ధన : అనవసరం ప్రశ్నలడక్క చెప్పినట్లు చెయ్యరా! మాట జారావంటే పెళ్ళి వీపుకి చేస్తాను!

ప్రసా : (చేమగా చూస్తూ) అల్లానా? అయితే ఎవరితోనూ చెప్పను! (M.B. లోకి తొందరగా వెళ్ళిపోతాడు.)

ధన : ఈ పురోహితుడు, ఇంకా రాలేదేమిటి చెప్మా!— ఒరేయి చెవలయ్యా!

చెవ : బాబయ్యా!

ధన : నేను అల్లా వీధులోకెళ్ళి పురోహితుణ్ణి కేకేసుగొస్తాను గాని, నువ్విల్లు జాగ్రత్తగా చూస్తూండు.

[ధనరాజు L.F.లోకి వెళ్ళి ఒక క్షణం ఆగి కంగారుగా మళ్ళీ వెనక్కి చక్కా వస్తాడు.]

చెవ : ఏం బాబయ్యా ?

ధన : (బెదురుతూ L.F. కేసి చూస్తూ) ఆహా! వీడెవడు రామారావు లేడురా ? ఇక్కడేదో కొంప లంటుకున్నట్టు గబగబా చక్కా వస్తున్నాడు. ఇంట్లోకి వస్తాడేమో, ఖర్మ! ఒరేయి! నేను వెళ్ళి ఆ వరండాలో నుంచుంటాను, వాడొస్తే నేను ఊళ్ళో లేనని చెప్పి పంపించెయ్యి!—ఆ? జాగ్రత్త (R.F. లోకి కంగారుగా వెళ్ళిపోతాడు)

రామా: (L.F. లోంచి "ధనరాజుగారూ" అంటూ పిలుస్తూ వచ్చి) ఏం చెవలయ్యా! మీ అయ్యగారున్నారా ?

చెవ : తమరా బాబయ్యా? అయ్యగారు నేరండి!

రామా: (నిట్టూర్చి) ఎక్కడికెళ్ళారు ?

చెవ : ఊరెళ్ళారండి.

రామా: ఎప్పుడొస్తారు ?

చెవ : తెల్దండి !

రామా: సరే! రాగానే నేవచ్చి వెళ్ళానని చెప్పు! (L.F. కేసి తిరుగుతాడు.)

ప్రసా : (M.B. లోంచి వచ్చి, రామారావుని చూసి) ఏమండోయి, రామారావుగారు! మళ్ళీ వచ్చారేం ?

రామా: (చిరునవ్వుతో) నువ్వున్నావా ? మీ బావగారితో పనుండి వచ్చానులే! ఊరెళ్ళార్టగా ?

ప్రసా : (ఆశ్చర్యంగా) ఊరా ?

చెవ : (హడిలిపోయి) సిత్తం! ఎల్లినారండి! (రామారావుతో) తమరు వెళ్ళి రండి, బాబయ్యా !

ప్రసా : నీ ముఖం !– ఊరెళ్ళడమేమిటి ?– కాలుకాలిన పిల్లిలా వరండాలో తిరుగుతున్నాడు. నేను కేకేస్తానుండండి !– బావా !- బావా !– (అంటూ గట్టిగా అరుస్తూ R. F. లోకి వెళ్ళి, వెంటనే బెదురుతూ వెనక్కి చక్కా వస్తాడు.)

ధన : (మటమట లాడిపోతూ R. F. లోంచి వచ్చి, రామారావుని చూసి నవ్వు తెచ్చిపెట్టుగుని) ఓహో, రామారావుగారా ?– దయచేయండి !

చెవ : (బిక్క మొహంతో) తమరింకా ఊరెళ్ళనేదా, బాబయ్యా !

ధన : ఇదుగో, ఇప్పుడే బయల్దేరాను. (ప్రసాదం కేసి పులిలా చూస్తూ) ఇంతలో మన ప్రసాదం కేకేశాడు ! (ప్రసాదం ఆకోపంచూసి బెదిరి M. B.లోకి వెళ్ళిపోతాడు. వెనక్కాలే తలకొట్టుగుంటూ చెవలయ్య వెడతాడు.) ఏం, ఇల్లా దయచేశారు ?

రామా : ఆ, ఏం లేదండి. నారాయణరావు కార్డులు అవీ అచ్చు వేయించాలని తొందర పడుతున్నాడు. ముహూర్తం పెట్టించారేమో కనుక్కుందామని వచ్చానండి !

ధన : దానికోసం మీరు రావాల్టండీ ?– నేనూ ఇప్పుడే భోగారావు ఇంటికి కబురు పంపిద్దాం అనుకుంటున్నాను !

రామా: (ఉత్సాహంతో) అల్లానాండీ ?

ధన : మరే !- పురోహితుడు శనివారం రాత్రి 11-45 ని॥ లకు ముహూర్తం నిర్ణయించాడు. సవివరంగా కాగితం మీద వేసి ఇస్తానన్నాడు. ఇవ్వగానే మీకు అందజేస్తాను.

రామా: సరేనండి !-అయితే, అవతల ఎల్లుండి రాత్రి అన్న మాటండి !

ధన : అదే !- ఏడో తారీకన్నమాట ! తమకి బోల్డుపన్లుంటాయి; వెళ్ళిరండి !- నారాయణరావుగార్ని అడిగానని చెప్పండి !

రామా: అల్లాగేనండి !

ప్రసా : (M. B. లోంచి వస్తూ) బావా, బావా !-(రామారావుని చూసి) మీ రింకా ఇక్కడే ఉన్నారా ?

రామా: (చిరునవ్వుతో) వెళుతున్నానుగాని, ఏమిటి హడావుడిగా ఉన్నావు ?

ప్రసా : (ధనరాజు కోపంచూసి) నేను చెప్పను !

ధన : ఏడిశావుగాని, లోపలి కెళ్ళు !

ప్రసా : వెడతానుగాని, నువ్వు అసలైంది మర్చిపోయావు !

ధన : (హడిలిపోయి, కోపంగా) నోరుమూసుగుని లోపలి కెళ్ళరా ?- వచ్చి మాట్లాడతానులే !- (ప్రసాదాన్ని రహస్యంగా M. B. కేసి తోస్తూ) వెళ్ళు !

ప్రసా : (కోపంగా) అల్లా తోస్తావేం ? కంసాలితో చెప్పి పుస్తెలు చేయించావు !-ఇది నీఖర్చే !- ఇప్పుడే చెబుతున్నాను !

ధన : (పిచ్చికోపంతో, తలకొట్టుకుని) ఖర్మ ! అన్నీ చేయించానురా !– (ఏడుపు మొహంతో) నువ్వు ముందర లోపలి కెళ్ళరా !

ప్రసా : (కోపంగా) ఎందుకూ ?– నేను వెళ్ళను !

రామా: (చిరునవ్వుతో) పెళ్ళిపెత్తనం అంతా నీదేనేమిటోయి ?

ధన : ఏమిటో ఖర్మ ! అక్కర్లేని గొడవంటూ లేదు, వీడికి. ఆలస్య మయిపోతుందేమో, మీరు వెళ్ళి రండి !

రామా: అల్లానేనండి ! నమస్కారం !– ప్రసాదం ! అరేంజిమెంట్లన్నీ ఎంత హడావుడిగా చేయిస్తావో. మరి! – శనివారంరాత్రే ముహూర్తం !

ప్రసా : (ఉత్సాహంగా) వేళారు పప్పులో కాలు !– ఈవాళ రాత్రే ముహూర్తం !

రామా: (ఆశ్చర్యంగా) అదేమిటీ ?

ధన : (పిచ్చికోపంతో పిడికిళ్ళు బిగించి కళ్ళుమూసుకుని బాధగా గుటకేసి) ప్రసాదం ! కళాయిమొహంతో అల్లాకూర్చోకపోతే, కాస్త కల్యాణంబొట్టు పెట్టుకోకూడదురా ?

ప్రసా : మరి బుగ్గనిచుక్కో !–

ధన : (కసిగా) అది నేవచ్చి అంటిస్తానుగాని ముందు లోపలి కెళ్ళి బొట్టెట్టుకో ! (ప్రసాదం ఉత్సాహంగా M. B. లోకి వెళ్ళిపోతాడు.)

రామా: ప్రసాదం—

ధన : (రహస్యం చెబుతున్నట్టు ఎడమ ఎదరకి తీసికెడుతూ) ఇల్లాగండి. చెబుతాను! వాడికి మొదట అనుకున్నది అవటంలేదు కదండీ? అంచేత మాలోనే మరోసంబంధం చూసి వీడిపెళ్ళి ఈరాత్రే కానిచ్చేస్తున్నాను!

రామా. అదా!— (చిరునవ్వుతో) మరి నన్ను పిల్చారు కారేం?

ధన : ఆ! పిల్ల కొంచెం అనాకారి! డబ్బుందికదా అని సరే అన్నాను! పైగా ఆడంబరాలు లేకుండా అయిందనిపించేస్తాం అని ఆడపెళ్ళివారు కాళ్ళా వేళ్ళా పడుతున్నారు!

రామా: అదాండీ విషయం!

ధన : (నవ్వి) అంతేనండీ! లేకపోతే మాకు అన్నివిధాలా కావలసినవారు మిమ్మల్ని పిలవకుండా ఉంటానాండీ?

రామా: పోన్లెండి! ప్రసాదానికి పెళ్ళవుతున్నందుకు నాకు చాలా సంతోషంగా ఉంది – ధనరాజుగారూ! పెళ్ళిలో నా కట్నం కింద ఇది పెళ్ళి కూతురికి చదివించండి! (అంటూ అయిదు రూపాయలకాగితం ఇస్తాడు.)

ధన : (పుచ్చుకుంటూ) ఏమిటో మీకు చాదస్తం!— సరే ఇవ్వండి!

రామా: వస్తానండి, నమస్కారం!

ధన : శుభం! వెళ్ళిరండి! (రామారావు ఉత్సాహంగా L. F. లోకి వెడతాడు. ధనరాజు కోపంతో మండి పోతూ) వీడి మొహం మండిపోనూ! ఈ ప్రసాదం గాడు నన్ని కొంపలో బతగనిచ్చేలా లేడు!—ఒరేయి, ప్రసాదం!— ప్రసాదం!

ప్రసా : (ఉత్సాహంతో M. B. లోంచి వచ్చి) నా బొట్టు బావుందా, బావా?

ధన : నీ మొహంలా ఉంది! వెధవ పన్లూ నువ్వూను! పెళ్ళిమాట ఎత్తకురా అంటే ఇక్కడకొచ్చి అదే మాట మాట్లాడతావేరా?

ప్రసా : పెళ్ళిమాటనే అన్నానా? పుస్తెలు మరిచిపోయా వేమోనని చెప్పాను!

ధన : ఏడవ లేకపోయావు!— ఇప్పుడా చెప్పడం?

ప్రసా : మరింకెప్పుడూ? పెళ్ళయిపోయాక చెప్పమన్నావా?

ధన : (కోపంగా దగ్గరికి వెళ్ళి) ఇల్లాంటి తలతిరుగుడు సమాధానాలు చెప్పద్దనే లక్షసార్లు (వీపు మీద విసురుగా కొట్టి) గడ్డిపెట్టాను! నోరెత్తు, ఈ సారి చెబుతాను, చవుడు తలకాయి!

ప్రసా : (బాధగా వీపు రాసుగుంటూ, కోపంగా) పుస్తెలు నువ్వు మర్చిపోయి పైగా నన్ను కొడతావెందుకు? నీదే చపటా తలకాయి!

ధన : (ఉగ్రుడై) ఏమిట్రా కూశావు ? (చెంపమీద కొట్టి) మళ్ళీ అను !— అంటావా ?— అంటావా ? (అంటూ పిచ్చి కోపంతో అందిన చోటల్లా కొడతాడు)

ప్రసా : (బెదురుతూ చూస్తూ, బాధగా) బావా !—బావా !— అనను బావా !—అనను బావా !—

చెవ : (M. B. లోంచి ఆదుర్దాగా పరుగెత్తుకొస్తూ) బాబయ్యా !— బాబయ్యా !— (అంటూ కంగారుగా వచ్చి ప్రసాదాన్ని దగ్గరగా తీసుకుంటాడు.)

ధన : (ఆయాసంతో కోపంగా) ఏమనుకుంటున్నావో, నా సంగతి! ఒళ్ళు చీరేస్తాను, జాగ్రత్త! ఎందుకెందుకని, వచ్చినప్పటి నుంచి చూస్తున్నాను, వెధవఎగు రుడూ వీడూను !

ప్రసా : (బుంగమూతితో) పెళ్లి చేస్తానని పిలిచి కొడతావా, బావా ?

ధన : కొడతానా ఇల్లాంటి మాటలంటే, నరుకుతానా ?

ప్రసా : (భయంగా) చూడు, చెవలయ్యా !

చెవ : ఊరుకోండి, ప్రసాదంగారూ !— ఏటి బాబయ్యా మీరు కూడాను !

ధన : (కోపం తమాయించుగుని) చాలు, చాలు ! శుభమా అని పెళ్ళనబోతూంటే ఈ గోలేమిటి ?— వెధవపనులు చేస్తే తగలవు సరీ ?— తగుల్తాయి !— చెవలయ్యా ! వాణ్ణి లోపలికి తీసుగెళ్ళి స్నానం చేయించి మళ్ళీ

బొట్టూ అదీ పెట్టు! అమ్మాయిని కూడా ఇంక కిందికి దిగిరమ్మను! ఈ పెళ్ళేదో అయిపోతే నేనూ మా పెద్దలూ అంతా తరించి తగలడతాం!-ఖర్మ! ఈ పురోహితుడు ఇంకా రాలేదు. నేను వెళ్ళి నిమిషంలో కేకేసుగొస్తాను- ఇల్లు జాగ్రత్తగా చూస్తూండు! వెళ్ళరా, ప్రసాదం!- త్వరగా తయారవు! (అని L. F. లోకి విసుగ్గా, బాధతో వెడతాడు)

చెవ : రండి బాబయ్యా!- నీళ్ళోసుగుందురు గాని

ప్రసా : (బాధతో తడుముకుంటూ) ఎ౹తెంత దెబ్బలు కొట్టాడో చూశావా?

చెవ : ఊరుకోండి బాబయ్యా! ఏంసేస్తాం? డబ్బు కాపీర్ణం అట్టాసేయిత్తది. పెళ్ళి ఇట్టంనేదంటే కన్నకూతుర్నే అట్లుతేలేలా కొట్టాడు, మీరూ నేనూ ఓ నెక్కా- ?

ప్రసా : (జాలిగా చూస్తూ) శాంతనీ కొట్టాడూ? (అదిరిపడి) అదేమిటి, చెవలయ్య? శాంత పెళ్లి ఇష్టంలేదందా?

చెవ : (నాలిక కొరుక్కుని) నోరు జారిపోయింది! నన్నేమీ అడక్కండి! బాబూ, రండి! ముసలాయనకి తెలిసిందంటే ముందు నా పీక నొక్కేత్తాడు!

ప్రసా : ఆగు, చెవలయ్యా! మాట! (బాధగా) శాంత అల్లా అందా? నిజంగా అందీ?

చెవ : నన్ను సంపకండి, బాబయ్యా! మీకు దణ్ణం పెడతాను!

ప్రసా : చెప్పు, చెవలయ్యా! నన్ను చంపుకుతిన్నట్టే! చెప్పవూ?

చెవ : ఎల్లాగండీ, మీతోటి! నేసెప్పినట్లు మళ్ళీ ఎక్కడా సెప్పరుగదా!

ప్రసా : ఒట్టు, చెప్పను.

చెవ : (బెదురుతూ ఇటూ అటూ చూసి) మనం బజార్లోకి ఎళ్ళినాక శాంతమ్మగారు మీతో పెళ్ళి ఇట్టంలేదని అయ్యగార్తో సెప్పార్ట!

ప్రసా : ఇష్టంలేదందా? (ఆలోచించి. ఆశగా చూస్తూ) ఉత్తినే అందేమో చెవలయ్యా!

చెవ : (విసుగ్గా) ఉత్తినే ఏటండీ, సెంపలు వాసిపోతేనూ!

ప్రసా : మరి, ఎందుకంది?

చెవ : ఇందాకా అయ్యగారు, డబ్బుకోసం కక్కుర్తి పడి, అమ్మాయిగారికి రామారావుగారికి ప్రధానం సేసేశారు!

ప్రసా : (తెల్లబోయి) ఆ! ప్రధానమే!

చెవ : ఆ! ఇప్పుడు మళ్ళీ మిమ్మల్ని సేసుగోమంటే, అమ్మాయిగోరు ఒప్పుకోనేదట! అంచేత కొట్టారంట కూడాను!

ప్రసా : ఎంతపని చేశాడు, బావ! (అమితమైన బాధతో) డబ్బుకోసం ప్రధానం చేసేస్తాడా? నేనిద్దునుగా ఆ వెధవడబ్బు!

చెవ : ఈపాటిగ్గానం ఆ కునకుంటే ఇంకేం, రండి! నీళ్ళోసు గుందురుగాని !

ప్రసా : (నిట్టూర్చి, కళ్ళు తుడుచుగుని, అలోచించి) నువ్వు ముందెళ్ళు! నీళ్ళు తొలుపు-వస్తాను!

చెవ : సిత్తం! తొందరగారండి! (అని R. F. లోకి వెళ తాడు.)

ప్రసా : (విచారంగా అలోచిస్తూ) ప్రధానం చేసేస్తాడా, శాంతకి? పైగా కొడతాడా అంత మంచిశాంతని!

[శాంత మెల్లిగా మేడమెట్లు దిగి వస్తుంది]

శాంత : (కన్నీళ్ళు తుడుచుగుని) మావా !

ప్రసా : (కంగారుగా కన్నీళ్ళు తుడుచుగుని) రా, శాంతా !

శాంత : (ఆశ్చర్యంగా) ఆతళ్లేమిటి, మావయ్యా! నాన్న కొట్టిన దెబ్బలే !

ప్రసా : నిన్నూ కొట్టాటగా?

శాంత : (తలవంచుగుని) అది, నాఖర్మ !

ప్రసా : (చిరునవ్వుతో) ఇది నాఖర్మ' (శాంత కేసి నిశ్చలంగా పరీక్షగా చూస్తూ) ఇందాకా రామారావుగా రొచ్చారు !

శాంత : (ఆశ్చర్యంతో విని, చాలా బాధతో) వచ్చారా?

ప్రసా : (శాంత తనకి దక్క-దన్నట్టు నీళ్ళునిండిన కళ్ళతో చూస్తూ) శాంతా!

శాంత : అదేమిటి, మావయ్యా !–కళ్ళమ్మట ఆ నీళ్ళెందుకు?

ప్రసా : (ఏడ్చేస్తూ) శాంతా! ఒక్కటి అడుగుతాను చెబుతావా ?

శాంత : ఏమిటి?

ప్రసా : (ఏడవలేక, చెప్పలేక) నేనంటే–ఇష్టంలేదా, శాంతా?

శాంత : (మనస్ఫూర్తిగా) నీమీద ఇష్టంలేక పోవడమేమిటి, మావయ్యా !– ఎవరన్నారు ?

ప్రసా : మీనాన్నతో అల్లా చెప్పావుటగా ?

శాంత : అదా !– (ప్రసాదం మొహం చూడలేక) అది వేరు!

ప్రసా : ప్రధానం అయిపోయిందనా?

శాంత : (ఏడుస్తూ) నీకెల్లా చెప్పను, మావయ్యా !

ప్రసా : (విచారంగా, తనలోలాగ) నువ్వెప్పుడూ నాతో సరదాగా ఉంటావనుకున్నాను. మావూరొస్తావు!... మాఇంట్లో ఉంటావు !...

శాంత : (బాధతో) మావయ్యా !–

ప్రసా : (శాంతవైపు తేల్లబోయిచూసి, ఆదుర్దాగా) పోన్లే, శాంతా !– ఏడవకు !– ఏంజేస్తాం ? (పెళ్ళిబొట్టు తుడిచేసుకుంటూ) నా కెప్పుడూ అదృష్టంలేదు, అంతే !– పైగా అతను బోల్డు అందంగా ఉంటాడు, చదువుకున్నాడు...బాగా మాట్లాడతాడు !–నా కేం ఉంది ? మతికూడా లేదంటాడు, బావ !– ఉందంటే కొడతాడు కూడాను! రామారావుగార్నే చేసుగో శాంతా, నువ్వైనా సుఖపడతావు !

శాంత : లేదు, మావయ్యా!– నాకా అదృష్టం లేదు! (ఏడుస్తూ) అమ్మతోనే పోయింది (అంతగా అక్కడ నిలబడలేక M. B లోకి విసురుగా వెళ్ళిపోతుంది.)

[ప్రసాదం కళ్ళమ్మట నీళ్ళు కారుస్తూ రంగంమీద కొయ్యబొమ్మలా ఓక్షణం నిలబడిపోతాడు. M. B. వైపు తిరిగి, తల అడ్డంగా ఆడించి, కుర్చీలో కూలబడి భోరున ఏడుస్తాడు. ఏదో నిశ్చయానికి వచ్చినట్టు మెల్లిగా తేరుకుని లేచి M. B. లోకి వెడతాడు. ఒకక్షణం ఆగి తిరిగి M. B. లోంచి, ఓచిన్న ట్రంకుపెట్టి, పాతగొడుగు పుచ్చుగుని వచ్చి, M. B. వైపు నీళ్ళునిండిన కళ్ళతో చూసి, నిట్టూర్చి, L. F. కేసి నడుస్తాడు. శాంత M. B లోంచి వచ్చి తెల్లబోయి చూస్తుంది. పరుగులో ప్రసాదానికి అడ్డంవెళ్ళి]

శాంత : మావయ్యా !– మావయ్యా !– ఏమిటీ ప్రయాణం ?

ప్రసా : మాఇంటికి !–

శాంత : ఎందుకు ?

ప్రసా : ఇంటి కెళ్ళాలి, పనుంది !–

శాంత : లేదు, నువ్వేదో బాధపడుతున్నావు !–

ప్రసా : (నవ్వడానికి ప్రయత్నించి) అబ్బే, నాకేం బాధ ఉంది ?

శాంత : లేదు !– మావయ్యా !– (ఏడుస్తూ) నువ్వు లోపల చాలా బాధపడుతున్నావు !– నాతో చెప్పవూ ?– నామీద ఒట్టే ! (అని సామాను తీసుకుంటుంది)

ప్రసా : (ఏడుపు ఆపుగోలేక, ఆవేశంతో) శాంతా !– నే నిన్నాళ్ళూ ఏదో అనుకున్నాను, శాంతా !– నిజం

ఇప్పుడు తెలుసుకున్నాను. ఇన్నాళ్ళూ తెలుసుకో లేక పోయానే అని బాధపడుతున్నాను!

శాంత : బాధపడకు మావయ్యా!— నువ్వూ నేనూ బాధ పడితే వచ్చేదేమీ లేదు. కొందర్ని దేవుడు బాధ పడడానికి పుట్టిస్తాడు. పోనీ నాన్న నేనా సుఖపెట్టిన వాళ్ళం అవుతాం!— నాన్న చెప్పినట్లు చెయ్య కూడదూ?

ప్రసా : చెయ్యకూడదు!— చెయ్యకూడదు, శాంతా!— నేను చేసుగో లేను! మీనాన్నకి సిగ్గు లేకపోతే నాకూ లేదూ?— మతి లేకపోయినా సిగ్గుంది! నేను వెళ్ళి పోతాను, శాంతా! కాని వెళ్ళేముందు ఒక్క మాట!—

శాంత : నువ్వెళ్ళొద్దు, మావయ్యా!—

ప్రసా : నామాటకి అడ్డంరాకు శాంతా!— వస్తే ఈమాటలు కూడా రావు!— శాంతా!— (కన్నీళ్ళు తిరుగు తాయి) అనవసరమని తెలుసున్నా, చెప్పాలని ఎందుకో అనిపిస్తోంది!— ఎందుకూ పనికిరాని ఈ మావయ్య అంటే నీకు చాలా ఇష్టమని, ఏమన్నా నవ్వుతావని చచ్చిపోయేదాకా జ్ఞాపకం పెట్టు కుంటాను, శాంతా!— అంతేకాదు— నీకోసం, నీ కిష్టమయినవాళ్ళకోసం ఎప్పుడు ఏంచెయ్యమన్నా సిద్ధంగా ఉంటానని నమ్ము!— కాని నీకు చాలా

ఆనందంగా ఉన్నప్పుడు, ఎంతో హాయిగా ఉన్న
ప్పుడు- చిన్న చిన్న పాపాయిలు నిన్ను చూసి నవ్వు
తున్నప్పుడూ, వీలైతే ఈ వెఱ్ఱిమావయ్యనికూడా
ఒక్కసారి జ్ఞాపకం చేసుగో, శాంతా!- వస్తాను!-
(అని విసురుగా వెళ్ళిపోబోతాడు)

శాంత: మావయ్యా! పుట్టిననాడే తల్లిని పొట్ట నెట్టు
కున్నాను. కన్నతండ్రి కటికరాయికన్నా కనిష్టమై
పోయినాడు (ఏడుస్తూ) ఉన్న ఆత్మబంధువుడివి
నువ్వుకూడ నన్ను దిక్కుమాలినదాన్ని చేసి వదలి
వెళ్ళిపోతావా మావయ్యా (అని కాళ్ళుపట్టుకుని
ఏడుస్తుంది.)

ప్రసా: వెళ్ళను...లే శాంతా! వెళ్ళనన్నానుగా? ఇప్పు
డింతకన్నా ఏంచెయ్యడానికీ తోచక వెళ్ళిపోదా
మని అనుకొన్నాను; నీసుఖంకన్నా నాకింకేం
కావాలి శాంతా? నాకు నీకంటె దగ్గరవాళ్ళెవ
రున్నారు? (ఏడుపు ఆపుకుంటూ) ఏడవకు,
శాంతా, నిన్ను సుఖపెట్టాలనీ నువ్వు నవ్వుతూంటే
చూడాలని, ఎప్పుడూ నువ్వు నవ్వుతూనే ఉండాలనీ
వుంది!- ఎల్లా?- ఏంచేయడానికి తోచడంలేదు.
(ఆదుర్దాగా యిటూ అటూ చూసి రెండుచేతులూ
ఆకాశంవైపు విసిరి నిరాశతో నిస్పృహతో
ఏడుస్తూ) భగవంతుడా!- నాకు కొంచమయినా
తెలివితేటలు ఎందుకు ఇచ్చావు కాదూ?-

శాంత : (ప్రసాదాన్ని ఓదారుస్తూ) ఏమిటి మామయ్యా అల్లాయిదవుతావు ?

చెవ : (R. F. లోంచి వచ్చి) ఇంకా యిక్కడే కూకు న్నారా, బాబయ్యా! రండి టైమవుతోంది; తమరు కూడ త్వరగా తయారవండి. ఎల్లండి. ఏంచేత్తాం రండిబాబయ్యా! (శాంత కళ్ళుతుడుచుకుని M. B. లోకి వెళుతుంది.)

ప్రసా : నేను రాను.

ధన : (L. F. లోంచి వస్తూ) ఏరా, యింకా యిల్లాగే కూచున్నావేం ? ఆ మొహమేమిటి ? ఆ వాలక మేమిటి ?

ప్రసా : (కోద్దిగానవ్వి) తెలివి తేట లొస్తున్నాయి !–

ధన : అల్లానేవుంది. (చెవలయ్యతో) వీణ్ణి తీసి కెళ్ళి స్నానం చేయించమని చెప్పాను కదరా ?

చెవ : సెప్పారండి.

ధన : మరి తీసుకెళ్ళలేదేం ?

చెవ : ఆయన రాటంనేదండి, (L. F. లోంచి నారాయణ రావు, రామారావు వస్తారు.)

నారా : నమస్కారం, ధనరాజుగారూ !

ధన : (మాటవిని తుళ్ళిపడి వెనక్కి తిరిగి) ఎవరు? మీరా? ఏం మళ్ళీవచ్చారు?

నారా : ప్రస్థానానికి యీరాత్రి వెళ్ళని మావాడికోసం చూస్తే వరగారికి ఊళ్ళో వున్నాం కదాఅని చూడ్డానికి వచ్చాం. ఇంకా ఆలస్యమేమిటి?

ధన : (కోపంగా) ఆలస్యం లేదుకాని మీరు రాకూడదని చెప్పానుగా ?

నారా : (నాలుక ఝాడించి) ఆఁ ! జరుగుతున్నది శుభ కార్యం. ఒద్దంటే మానొస్తామా? చెవలయ్యా! (రామా రావుని చూపిస్తూ) అల్లుడిగారికీ నాకూ కాఫీలు పట్రా!

ధన : (కఠినంగా) నారాయణరావుగారూ ! ఆయన అల్లు డూకాదు. మీకు కాఫీలూరావు. మీరు తక్షణం బయటికి వెళ్ళిపొండి.

రామా: (తెల్లబోయి) ధనరాజుగారూ!

ధన : నేనింకేమీ వినదల్చుకోలేదు. మీరు వెళ్ళండి.

నారా : (అనుమానంగా) వెళ్ళకపోతే?

ధన : తర్వాత విచారిస్తారు.

నారా : (సూటిగా చూస్తూ) పెళ్ళికొడుకు లేమన్నా తారు మారయ్యారా?

ధన : అవుతే అవుతారు.

నారా : ఇదేదో మోసంలా ఉందే !

ధన : మీరు చేసింది మోసంకాదూ! నన్నుడ కత్తెరలో బిగించి, దభాయించి, మా అమ్మాయిని పెళ్ళిచేసు

గుని నా ఆస్తి అంతా లాగేద్దామని ఎత్తువెయ్య లేదూ? మీలాంటి వయవంచకుల కిదేమందు. నడవండి.

నారా : (బెదిరిస్తున్నట్లు) ధనరాజుగారూ! అగ్గిబరాటా లాంటి కాగితం ఒకటి యింకా మా చేతుల్లోనే ఉన్నట్లు మర్చిపోయినట్లున్నారు.

ధన : ఏమీ మర్చిపోలేదు. నాడబ్బు నా కొచ్చింత ర్వాత నాకేమీ భయం లేదు. మీ ఆ బరాటా కాగితం యింటికి పట్టుకెళ్ళి నాలిక గీసుకోండి.

రామా: ధనరాజుగారూ! జరిగిన దానికి క్షమించండి. మీ ఆస్తి మీద నాకెంతమాత్రం ఆపేక్ష లేదు. అందులో చిల్లి గవ్వయినా నాకక్కర్లేదు. శాంతా నేనూ మన సారా ప్రేమించుకున్నాం. మాట నిలబెట్టుగుని మా వివాహం చెయ్యండి. జన్మంతా ఋణపడివుంటాను.

ధన : ఉన్న రెండురోజులూ అనుభవించానుగా! చాలు! యింతకీ మీరు మర్యాదగా వెడతారా? వెళ్ళరా? చెవలయ్యా!

ప్రసా : (మెల్లిగా లేచి) ఆగు చెవలయ్యా! బావా! వాళ్ళిద్దరికీ యిష్టమైనప్పుడు పెళ్ళి చేసెయ్యకూడదూ? ఎందుకీ గొడవ?

ధన : ఏడిసినట్టేఉంది నీ సలహా. యిన్నికష్టాలూ పడి సంపాదించిన డబ్బునీ, కంటికి రెప్పలా పెంచు

కొచ్చిన పిల్లనీ, దిక్కూ మొక్కూలేని ఓ బికారి వాడి చేతుల్లో పెట్టమంటావురా ?

రామా: ధనరాజుగారూ! నోరు పారేసుకోకండి. డబ్బు లేక పోయినా మీకంటె మర్యాద కలవాణ్ణే!

ప్రసా : మీరూరుకోండి. బావా ! నీకు శాంత సుఖంకన్న డబ్బే ప్రధానమన్నమాట.

ధన : మధ్య నీగోలేమిట్రా ?

ప్రసా : (కోపంతో రోషంగా) నా ఆస్తికోసమేగా నన్నిక్కడికి తీసుకొచ్చావు ? నా ఆస్తికోసమేగా నాతో లేనిపోని అబద్ధాలు చెప్పావు? (ఏడుపు ఆపుకుంటూ) నా ఆస్తి కోసమేగా నన్ను వెర్రివాడిలా ఆడించావు ?– (ఏడుస్తూ) నా ఆస్తి కోసమేగా యిప్పుడు దాని బతుకు బండలు చేస్తున్నావు ? (విసుగ్గా) తీసుకో వెధవ ఆస్తి! ఉట్టికట్టుకు ఊరేగు. బావా!– నీకు తగిన శాస్తి నేను చేస్తాను. బావా ! నువ్వు శాంతని రామారావుగారి కిచ్చి పెళ్ళి చేస్తే నా ఆస్తంతా శాంత పేర వ్రాస్తాను. లేకపోతే అంతా ధర్మసత్రాల కిచ్చిపారేస్తా– ఏం చెయ్య మంటావో చెప్పు !

ధన : (తెల్లబోయి, వెర్రివాడిలా చూస్తూ) ఇదేం రోగంరా నీకూ !

ప్రసా : యిది ఇంతే, నువ్వే అంటావుగా (రోషంతో) తెలివి తక్కువవాణ్ణని. అందుచేత యింత కంటె ఏం

చెయ్యలేకపోతున్నాను. నా డబ్బేకాని నా బ్రతుకంటే లెక్కలేదని యిప్పుడు తెలిసింది. తెలివిలేకపోతేమాత్రం మనిషినికానూ ?- రాయినా ? నాకు మాత్రం లోపల ఊహాలుండవ్నూ ? చెప్పుకో లేను-తీర్చుకోలేను-అంచేత తొక్కి పారేస్తారా ? తెలివుంటే యిదేనా చెయ్యవలసినపని ?

రామా: క్షమించు ప్రసాదం !

ప్రసా : మీ మాటకాదండీ. ఆమనిషిలో అంత మోసం ఉంటుందని నాకేం తెలుసు ? మోసం ఎప్పుడేనా చేశానా-చూశానా ? అంతా మనవాళ్ళే అనుకున్నాను. అందుకే ఇల్లా అయ్యాను. పోన్లే- యింక నా బతుక్కి ఆస్తిమాత్రం ఎందుకు ? మంచివాళ్ళకిస్తే పుణ్యమయినా వస్తుంది. ఏమంటావు బావా ? శాంత కిమ్మంటావా ? సత్రాల కిమ్మంటావా ?

ధన : (విని తెల్లబోయి తేరుకుని నిలబడి) రెండు లక్షల ఆస్తి ధర్మసత్రాలకి తగలెయ్యడం ఏమిట్రా? ఎవరు తిన్నట్టు? పోనీ నాపేర తగలెయ్యి.

ప్రసా : నీపేర చస్తే వెయ్యను అటో యిటో చెప్పు !

[M. B. లోంచి శాంత పరుగులో వస్తుంది]

శాంత : (ఏడుపు ఆపుకుంటూ, చేతులు పట్టుకుని) మావయ్యా !- వద్దు మావయ్యా. నాకోసం నువ్వు పా

డవకు. నీ మంచితనం, నీ త్యాగం చూస్తోంటే నే నెంత స్వార్థపరు రాలనో అని భయమేస్తోంది. యిన్నాళ్ళూ నిన్ను బాధ పెట్టిన పాపం చాలు, యింకా ఆస్తి కూడ ఎందుకు? నువ్వు మాత్రం ఆస్తిమాట తలపెట్టకు మావఁయ్యా. రాసిపెట్టిన దేదో జరుగుతుంది.

ధన : (తలపంకించి. నవ్వు తెచ్చిపెట్టుకుని) వద్దఁటా వేమిటే వెర్రిమొహమా? వాడేదో ముచ్చటపడి. ఈ పెళ్లి జరిగితె, ఆస్తి ఇస్తా నంటూంటే వాడి ముచ్చట కాస్తా తీర్చకుండ ఇంకా బాధ పెడతా వెందుకువాణ్ణి? నువ్వింకు చెబుతాను. ప్రసాదం!– నీ ఇష్ట ప్రకారమే చేయిస్తాను. మరి ఆస్తంతా వెంటనే రాసిచ్చేస్తావా?

ప్రసా : ఇప్పుడే పెళ్లి చేసెయ్యి!...తక్షణం రాసిచ్చే స్తాను.

ధన : ఇప్పుడే?

ప్రసా : ఆఁ! ఈ ముహూర్తానికే.

ధన : సరే! ఎవరి ఖర్మ ఎలావుందో ఎవరు చెప్పగలరు?– అల్లానేకానీ! ఒరేయ్ చెవలయ్యా! రామారావు గార్ని మంగళస్నానాలకి తీసుగెళ్ళు! టైమవు తోంది. ఈ పురోహితుడు ఆఖరి క్షణంలోవచ్చి భరతనాట్యం మొదలెడతాడు– వెళ్ళండి!

రామా: నేను రాను. ప్రసాదం ఆస్తిచ్చే పక్షంలో నాకీపె ళ్ళొద్దు !

ధన : (నిట్టూరుస్తూ) ఖర్మ ! మళ్ళీ మీకేమొచ్చిందండీ ? ఈపెళ్ళి కావాలనేగా ఇంతఅల్లరి చేశారు ?

నారా : ముందర వప్పుగోవోయ్, తర్వాత ఆలోచిద్దాం.

రామా: వీల్లేదు నారాయణరావు- ఆ మహానుభావుడి దగ్గిర కానీ అపేక్షించడం కూడా మహాపాపం !-

ప్రసా : రామారావుగారు ! మాశాంతకి మీరంటె ఎంతో ఇష్టం. శాంతని పెళ్ళిచేసుగో నవకండి. (కన్నీ ళ్ళతో) మీ కాళ్ళట్టుగుంటాను.

రామా: ప్రసాదం !...అంతమాటనకు ప్రసాదం. కాని నీఆస్తి మాకొద్దు.

ప్రసా : మీ కక్కర్లేదని నాకు తెలుసు. కాని నాఆస్తి నాదగ్గరుంటే మాబావ ఎల్లానూ కాజేస్తాడు. అంచేత మీదగ్గర దాచుగుంటున్నా ననుకోండి !

ధన : ప్రసాదం ! ఆస్తి శాంతపేర వెయ్యాలిసుమా !

ప్రసా : ఎంత అనుమానమో చూశారా మాబావకి !- కిందటి జన్మలో మారని బేడకాసై తిరిగుంటాడు !-

[ధనరాజు తప్ప అందరూ నవ్వుతూంటే ప్రెసిడెంటు L. F. లోంచి వస్తాడు]

ప్రెసి : పెళ్ళివారింకా ఇల్లానే ఉన్నారేం ? (అటూ యిటూ చూసి రామారావుని చూసి గుర్తుపట్టి గతుక్కుమని) నమస్కారమండీ కలెక్టరుగారూ!

చెవ : (రామారావుతో) మంగలత్తానాలకి రండి బాబయ్యా !

రామా: వస్తున్నాను, నడు.

ప్రెసి : ప్రసాదం అన్నావుకదటయ్యా పెళ్ళికొడుకు !

ప్రసా : నేను కాదండీ. పెళ్ళికొడుకు అదుగో— ఆయన.

ప్రెసి : ఇదేమిటి ?

ప్రసా : మరేమనుకున్నారు మాబావ నిముషాలమీద మేజిక్కులు చేస్తాడు.

ధన : నువ్వూరుకోరా !

ప్రెసి : (మెచ్చుకుంటూ) కలెక్టరుగారికే ఇచ్చి చేస్తున్నారూ ?

ధన : కలెక్టరుకాదండీ మావాడు ఊరికెనే అన్నాడు.

ప్రెసి : (తెల్లబోయి) అదేమిటి ? అబద్ధమా !

ధన : కాకపోతే నిజమనుకున్నారా ?

ప్రెసి : ఎంత చంపేశావయ్యా నన్ను. నిన్న రాత్రంతా నిద్రల్లేదు. (ధనరాజుతో ఠీవిగా) యీ పెళ్ళెప్పుడు కుదిరింది?

ధన : ఇప్పుడే.

ప్రెసి : బాగుంది బాగుంది—వీరెవరు ?

ధన : (కొంచెం విసుగ్గా) గోపారం జమీందారుగారబ్బాయి, నారాయణరావుగారు.

ప్రెసి : ఓహో ! వీరేనేమిటి వారు ?

ధన : ఆ!! వారేపీరు, ప్రసాదం! అన్నట్టు ప్రెసిడెంటు గారుకూడ వచ్చారుకదా ఇప్పుడే రాసిచ్చెయ్య కూడదూ?

ప్రసా : ఆఁ! రాసేస్తాను.

ప్రెసి : ఏమిటదీ?

ధన : ఆ!—మా ప్రసాదం ఈ వివాహసందర్భంలో కానుక క్రింద మాశాంతకి తన ఆస్తి యావత్తూ రాసి యివ్వదల్చుకున్నాడు. అంచేత అది తమరు కొంచెం రాసిపెట్టాలి.

ప్రెసి : ఓ దానికేం! కాగితం కలం తీసుకురండి.

[ధనరాజు M. B. లోకి వెడతాడు]

చెవ : (రామారావుతో) రండి బాబయ్యా!

రామా: (అడుగు ముందుకువేస్తూ) శాంతా (అని శాంతకి సంజ్ఞ చేస్తాడు. యిద్దరూ ప్రసాదానికి నమస్కరించ బోతారు.)

ప్రసా : అబ్బే నా కెందుకు?

రామా: నీ కోసంకాదు ప్రసాదం, మాకోసం. నీ ఋణం జన్మ జన్మలకీ తీర్చుకోలేం. (అంటూ శాంత వైపు చూస్తాడు. శాంతఁ కళ్ళమ్మట నీళ్ళు కారుస్తూ రామారావుతోపాటు ప్రసాదానికి నమస్కరిస్తుంది)

ప్రసా : (ఏడుస్తూ, నవ్వుతూ) ఇప్పుడు నే నేమనాలి?

నారా : ఆశీర్వాదానికి అందమైన మాట లక్కర్లేదు ప్రసాదం! కావల్సింది అసలైన అంతఃకరణ. అదే వీళ్ళ దాంపత్య జీవితానికి మొదటి మెట్టు. నీ ఆశీర్వాదంతో ఆ మెట్లు అనంతమౌతాయి. ఆశీర్వదించు ప్రసాదం!

(ధనరాజు కాగితంతో M. B. లోంచి వచ్చి ఆశ్చర్యంగా చూస్తాడు)

ప్రసా : మీ రిద్దరూ సుఖంగా ఉండండి! (కళ్ళమ్మట నీళ్ళు కారుస్తూ కొద్దిగా నవ్వుతాడు)

ధన : (ప్రెసిడెంటుతో) తర్వాత చూద్దురుగాని ముందరిది రాసెయ్యండి. పెళ్ళయ్యే లోపల సంతకాలయిపోవాలి. (సంతోషంతో) మా ప్రసాదం మంచితనం, మర్యాదా నాకు తెలియదూ? వాడితరహాయే వేరు!

ప్రసా : అల్లానా? యీ కబుర్లేం లాభంలేదు బావా! మరి పెళ్ళికొడుక్కి కట్నం ఏమిస్తావు?

ధన : (తెల్లబోయి కాగితాలు జార్చేస్తూ) కట్నమా? అదేమిటి?

ప్రసా : మరి—ఇదేమిటి?

(ధనరాజు శిలావిగ్రహంలా నిలబడిపోతాడు, అందరూ నవ్వుతూండగా)

(తెర)

---

శ్రీ కొండపల్లి ముద్రాశాల, రాజమండ్రి



## రచయిత

భమిడిపాటి రాధాకృష్ణ 14-11-1931 వ తేదీని రాజమహేంద్రవరంలో జన్మించారు. వీరు హాస్యబ్రహ్మ కీ॥ శే॥ శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారి ఏకైక పుత్రులు.

రాజమహేంద్రవరంలోని వీరేశలింగం హైస్కూలులోను, గవర్నమెంటు ఆర్ట్సు కాలేజీలోనూ విద్యాభ్యాసం చేశారు. 1950 లో B. sc, డిగ్రీ పొందారు. తరువాత ఛార్టర్డ్ ఎక్కౌంటెంట్సు కోర్సు అభ్యసించారు.

వీరి నాటక నాటికలు ఆంధ్రదేశంలోని వివిధ నాటక కళా పరిషత్తులలో రికార్డు బహుమతులను అందుకున్నాయి ముఖ్యంగా, ఆంధ్రనాటక కళాపరిషత్తు మహాసభలలో వీరి నాటికలు "మనస్తత్వాలు" 1958 లోనూ, "దాతవేదాంతం" 1959 లోనూ వరసగా ఉత్తమ రచన బహుమతులను అందుకున్నాయి. వీరి మొదటి నాటకం "ఇదేమిటి?" ఆంధ్రదేశంలో అనేకచోట్ల ప్రదర్శింపబడి విశేషమైన ప్రజాదరణ పొందింది. ఈ నాటకంలోని 'ప్రసాదం' పాత్ర ఉదాత్తమైన ఒక ప్రత్యేక సృష్టి.

రాధాకృష్ణ రచనల్లో నవ్యత ఉంది. సంభాషణల్లో అర్థప్రాధాన్యమైన హాస్యం ఉంది సంఘటన సంఘర్షణవల్ల హాస్యం సృష్టించగల శక్తి వీరిలో విశిష్టంగా కనిపిస్తుంది.

"కీర్తిశేషులు" నాటకం వీరి కొత్త రచన.